స్వప్నలిపి
అజంతా కవిత్వం
సంకలనం: త్రిపురనేని శ్రీనివాస్

కవిత్వం ప్రచురణలు-13
ప్రథమ ముద్రణ: జనవరి 1993
వెల: వంద రూపాయలు

కవర్ పెయింటింగ్: జాక్ ఉన్‌రూ, అమెరికా
సెంటర్‌స్ప్రెడ్ పెయింటింగ్: లక్ష్మా గౌడ్, ఇండియా
ఇన్‌సైడ్ పెయింటింగ్స్: మాక్స్ ఎర్నెస్ట్, జర్మని

లే అవుట్: అబ్దుల్లా
ఫోటోటైప్‌సెట్టింగ్: ఆంధ్రజ్యోతి దినపత్రిక, విజయవాడ
ముద్రణ: ప్రగతి ఆర్ట్ ప్రింటర్స్, హైదరాబాద్

ప్రతులకు: నవోదయ పబ్లిషర్స్, ఏలూరు రోడ్డు, విజయవాడ
నవోదయ బుక్‌హవుస్ 3–3–865, కాచిగూడ హైదరాబాద్– 27

# ఇంట్రో...

కవిత్వం ఒక స్వప్నక్రియ. నేను వ్రాస్తున్న కవిత్వం ఇంకా 'లిట్మస్ టెస్ట్' దాటలేదు. నేను శోధన నాళికలలో జీవిస్తున్నాను. అర్థసత్యాలలో జీవిస్తున్నాను. భిన్న, విభిన్న రసాయన చ్ఛాయలలో జీవిస్తున్నాను. భ్రమ, విభ్రమాలలో బ్రతుకుతున్నాను. ఒకవైపు భయంకరమైన వాస్తవం. మరొక వైపు కాలావధులకు అతీతంగా కలలపై పరిభ్రమిస్తున్న నైరూప్య ప్రపంచం. నా అన్వేషణ ప్రారంభం ఇక్కడే. కవిత్వ లక్ష్యం కెమేరాలో కనపడదు. ఉన్నది ఉన్నట్టుగా కనపడే ప్రపంచం వాస్తవం కానేకాదు. వాస్తవం ముసుగు తీయడమే వాస్తవం అంటే. మనిషిలో అంతర్భూతమై వున్న స్వప్న శక్తిని, స్వప్న శక్తి సార్వభౌమాధికారాన్ని వినిర్గతం చేయడం ద్వారా అతడు ఆశిస్తున్న కొత్త ప్రపంచాన్ని ఆవిష్కృతం చేయగలగాలన్నదే నా కవిత్వ పంథా. కవిత్వం తప్ప నాకు మరో జీవితం లేదు. అందుకోసమే నేను కవిత్వం రాస్తున్నాను. కలం, కాగితం పట్టుకుని మాత్రం కాదు. అక్షరాలు వాటంతట అవి ప్రత్యక్షమైతేనే ఏదైనా. ఆ రహస్యం నాకు తెలుసు. స్వప్న విద్య నాకు పుట్టుకతో వచ్చినదే. అక్షరం తర్వాత మరో అక్షరం. చీకటి అవయవాలపై తెల్లని అక్షరాలు. ఒక అక్షరాన్ని చుట్టుకొని ఎన్నో అక్షరాలు. వాక్యం తర్వాత మరో వాక్యం. అంతా ఒక 'చిత్కళ'. చిత్ర, విచిత్ర వాక్య సముదాయం. నేను అక్కడే వుంటాను. అక్షరం విచ్చుకుని స్వప్న ధూళిలో ఆవిర్భవించిన కొత్త అక్షరంలో నేను వుంటాను. 'స్వప్న లిపి' అంటే ఇదే. 'వర్తమాన జీవితం అగమ్యం, అస్పష్టం, అగోచరం, అర్థరహితం..., అజేయంగా వున్నదల్లా స్వప్న శక్తి సార్వభౌమాధికారం ఒక్కటే. అది అప్రతిహతం.

అన్నిటికీ కారకుడు మనిషి కనుక ప్రతి మనిషిలో నన్ను చూసుకోవడం నా కెంతో ఇష్టం. మనిషి ఎక్కడ వున్నా ఒకడే. పృథ్వీతలంపై మనిషి అడుగుల చప్పుడు వినపడిన తొలి క్షణం నుంచి మనిషి అంతరాత్మ ఒక్కటే. నేను ప్రతి మనిషిలో వుంటాను. ప్రతి మనిషి స్వప్నంలో వుంటాను. స్వప్న సౌందర్యంలో వుంటాను. బాధలో, దుఃఖంలో, మండుతున్న గాయాలలో వుంటాను. ఎడారిలో మనిషి ఆక్రందనలో వుంటాను. అధః పతితుడైన మనిషిని ఆప్యాయంగా లేవనెత్తుతున్న కారుణ్య హస్తాలలో వుంటాను. అక్షరాలకు సంకెళ్లు లేవు. భూగోళంపై సరిహద్దులు లేవు. మనిషి ఆత్మ ప్రకంపన ఒక్కటే అతడు మాట్లాడే భాషకు ఆయువుపట్టు. ప్రతి అక్షరం ఒక మనిషి. ప్రతి మనిషి ఒక అక్షరం. మనిషి ముఖకవళికలవలెనే, మనిషి అవయవ నిర్మాణం వలెనే అక్షరాలకు కూడా ఒక ఆకారం, ఒక భంగిమ, భావానుగుణ్యమైన ఒక కదలిక, ఒక లయ, ఒక విన్యాసం, రంగు, రుచి ఉంటాయని నేను విశ్వసిస్తాను. స్వప్న లిపి రహస్యం ఇదే. దైనందిన జీవన బీభత్సంలో నేను చేస్తున్న విచిత్ర విన్యాసాలే నా కొత్త ఛందస్సు.

నా కవిత్వంలో పూర్వ నిర్దేశిత భావాలకు అతీతమైన విపరీత, విలక్షణ విశృంఖల ధ్వని వినవస్తుందని చెప్పడానికి నేను వెనుకాడడం లేదు. కవిత్వం ఒక రహస్య క్రీడ. చీకట్లో ఉన్నవాడే జీవన రేఖపై అఖండ దీపాన్ని స్పష్టంగా చూడగలడని నా నమ్మకం. అనుభవరీత్యా కూడా. కవి అన్నవాడు ప్రపంచాన్ని చూడాలే తప్ప, తానై ప్రపంచానికి కనపడకూడదు. 'చీకటి చిత్రశాల' అనే పద్యంలో నేను వ్రాసిన కొన్ని వాక్యాలను ఇక్కడ ఉదహరిస్తాను: ''నా నివాసం ఎక్కడో శూన్యంలో చీకటి పాషాణాలపై స్వప్న శృంఖలాలలో కావచ్చుగాక; కాని శూన్యంలో చీకటి ప్రజ్వలనం నేను చూశాను, చీకటి ప్రజ్వలనంలో నిర్జీవ ప్రతిమ ఖడ్గ నాట్యం చూశాను''. చీకట్లో ఉన్న మనిషి జనన మరణ రహస్యాన్ని ఎలా ఆవిష్కృతం చేయగలడో ఈ పద్య భాగం వివరించడం లేదా? మృత్యువు హఠాత్ సంఘటన కాదు, అది ఒక పరిణామం మాత్రమే అన్న కఠోర సత్యాన్ని ఈ వాక్యాలు విశదీకరించడం లేదా? ''భయ, విభ్రమాల మధ్య విషాద వాక్యం వలె సాగే జీవితంలో మృత్యువు ఒక్కటే నిజం'' అన్నది ఒక హెచ్చరిక కాదా? మనిషి ఉన్నాడు కనుకనే

మరణిస్తున్నాడు. మృత్యువు శారీరకం కాదు. క్షణ, క్షణ జీవితం, క్షణ, క్షణ మృత్యువు. నేను ఇంకా సజీవంగానే ఉన్నానన్న విషయం నిర్ధారణ చేసుకోవడానికి నా మృత్యువును నేనే అనేకసార్లు నడివీధిలో చూశాను. చూడక తప్పదు. ''శిరస్సు తెగిన దీపస్తంభం మృత్యువు'' అన్న వాక్యాన్ని నేను కిరీటంగా ధరిస్తాను. మృత్యువు కూడా జీవితమే. మనం ఇప్పుడు జీవిస్తున్నది మృత్యుచ్ఛాయలలోనే కదా. మరణ రహస్యం ఇప్పుడు రహస్యం కానేకాదు. ఆశ, నిరాశ వేరువేరు కావు. జనన, మరణాలు వేరువేరు కావు. మనిషి సమాధి ప్రక్కనే మనిషి పుట్టుక. అంతా ఒకే వృత్తం. అంతా ఒకే లిపి. ఒకే అక్షరం. వాస్తవం అందంగా వుండదు. వాస్తవం చేదు విషం. గరళ కంఠుడైన కవి ఇక్కడే ఉద్భవిస్తాడు. పద్య సృష్టి జరుగుతున్నప్పుడు నన్ను నేను పోల్చుకోలేకపోవచ్చు. ఆచ్ఛాదన తప్పకపోవచ్చు. అందుకే కవిత్వం ఒక మర్మక్రీడ. పూర్తిగా అజ్ఞాతం, అజ్ఞాతం. స్వప్నమయం. మంత్రమయం.

ఇక్కడే ఒక మాట. నేను వ్రాసిన పద్యాలన్నీ చిత్తుప్రతులే. ఏ ఒక పద్యం కూడా నాకు పూర్తి సంతృప్తి కలిగించలేదు. పత్రికలలోనే కాదు, సంకలనాలలో ప్రచురితమైన పద్యాలు కూడా చాలా భాగం చిత్తుప్రతులే. 'సుషుప్తి', 'చెట్లు కూలుతున్న దృశ్యం', 'పరిత్యాగి పరివేదన' ఇంకా మరికొన్ని పద్యాలకు నాలుగైదు వెర్షన్లు వచ్చినట్టు గుర్తు. 'పెర్ఫెక్షన్' నా లక్ష్యం. దీన్నే 'క్రిస్టలైజేషన్' అని కూడా అనవచ్చు. శేష జీవితంలో అది సాధ్యమౌతుందో, కాదో చెప్పలేను.

ప్రచురితమైన పద్యం ఏదీ నా దగ్గర వుండదు. ఉండనివ్వను. మరుక్షణం అది నా కళ్లముందు ధ్వంసం కావలసినదే. అద్దంముందు ఆట్టేసేపు నేను నిలబడలేను. అది నా తత్వానికే విరుద్ధం. వ్రాసిన పద్యాన్ని లోకంమీద ఆరవేయడం వరకే నా పని. తర్వాత ఆ పద్యంతో నాకు నిమిత్తం లేదు. పద్యం ఏమైపోయినా, గాలిలో కొట్టుకుపోయినా ప్రమాదం లేదు. నేను వ్రాసిన ప్రతి పద్యం నాకు గుర్తు. ప్రస్తుత సంకలనంలోని పద్యాలన్నీ స్మృతిపీఠం ముందు కూర్చుని వ్రాసినవే. తారీఖులతో ప్రమేయం లేదు. 1948లో వ్రాసిన పద్యాన్ని గూర్చి ఇప్పటికీ నేను ఆలోచిస్తూనే వుంటాను. అవసరమైతే మార్పులు కూడా. కవి జీవన దృక్పథాన్ని బట్టే ఇదంతా. కవిత్వానికి క్యాలెండర్లు లేవు. పరిణామక్రమం అనే మాట నాకు కిట్టదు. నేను వ్రాసిన పద్యాలు బహుశా 40 పైగానే వుండవచ్చు. ప్రస్తుత సంకలనంలోని పద్యాలన్నీ 1948 నుంచి 1992 మధ్య కాలంలో వ్రాసినవే. ఏ పద్యం ఎప్పుడు వ్రాసినదీ స్పష్టంగా తేదీలు, సంవత్సరాలు చెప్పలేను. ప్రచురితమైన పద్య ప్రతులేవీ నా దగ్గర ఉండకపోవడమే కాదు, ఉంచకపోవడమే కారణం. కవిత్వం ఒక ఎడతెగని ప్రవాహం అనుకుంటే ప్రవాహజలం ఎక్కడైనా, ఎప్పుడైనా ఒకటే. హృదయాన్ని చీల్చుకుని వచ్చే అక్షరాలకు రసాయన దోషం అంటదు.

కవిత్వం సహస్రముఖి. భావం ఏదైనా, పద్య శరీర లక్షణం ఏదైనా కాలానుగుణ్యామైన భాష, ఆర్కిటెక్చర్ కవిత్వానికి అత్యంత ప్రధానం కదా! నేను వ్రాస్తున్న కవిత్వానికి ప్రాణవాయువు అదే. ముక్త కవిత్వానికి గౌరవప్రదమైన స్థానం కల్పించాలన్నదే నా లక్ష్యం. అది ఎంతవరకు నెరవేర్చగలిగానో చెప్పలేను. ఉదయం నిద్రలేవగానే సత్కవులందరినీ ఒకసారి తలుచుకొని జీవన ప్రవాహంలో అడుగుపెడతాను. పద్యసృష్టి మళ్లీ ప్రారంభం. నా దినచర్య అదే. నిరంతర ధ్యానం అదే.

**అజంతా**

# అంతా ఒకే శబ్దం

చెప్పలేదా నేను చెప్పలేదా అంతా ఒకే శబ్దం అని

సర్వవ్యాప్తమైన శబ్దవలయంలో
ఖండితహస్తాలు ఆవిష్కరిస్తున్న జననాంతర గ్రహణ దృశ్యాలను తలచుకొని
నీ కన్నులు జలార్ద్రమైనపుడు
చెప్పలేదా నేను చెప్పలేదా
మృత్యువు ఒక హెచ్చరిక మాత్రమే అని
ఆకురాలుతున్న శబ్దం ఒక ఆహ్వానం మాత్రమే అని
చెప్పలేదా నేను, చెప్పలేదా

భయకంపితమైన శబ్దం మీద
ఒక గవాక్షం తెరుచుకోగా
నేను, నా శరీరం ఒకేసారి నిలువునా బద్దలై రెండు ముఖాలతో నేను
మరో గవాక్షంలో అడుగు పెడుతున్నప్పుడు
చెప్పలేదా నేను చెప్పలేదా
అంతా ఒక కదలిక మాత్రమే అని
మరణానంతరం కూడా మనిషి మాట్లాడుతూనే ఉంటాడని
చెప్పలేదా నేను చెప్పలేదా

నిగూఢమైన ఒక శబ్దం వెనుక
అగాధం లోలోతులలో ఈదుతున్న నా పద్యాలు
ఎక్కడో ఒకచోట ఒడ్డు చేరుకొని త్రికాల నాట్యం చేస్తున్నప్పుడు
చెప్పలేదా నేను చెప్పలేదా
అక్షరం నిండా అన్నీ అద్భుతాలే అని
శబ్ద శక్తి సార్వభౌమాధికారం అనాహతం అని
చెప్పలేదా నేను చెప్పలేదా

అంతా ఒకే శబ్దం
ఒకే కదలిక
ఒకే ప్రవల్లిక

శరీరాన్ని జయించిన ఒక జీవితం అట్టడుగున
శబ్దపేటికలో ఒక అస్థిక వికసిస్తున్న శబ్దం నేనే

అంతా ఒక చిత్కళ.

**1992**



# అగ్ని స్పర్శ

బాధాగ్ని కుసుమాన్ని ఆఘ్రాణిస్తున్నప్పుడే
క్షణాల మధ్య అగాధంలో స్వప్న చకువులకు నిషా
ఖడ్గ ధారల మధ్య క్షతగాత్రుడైనా అప్పుడు ఉజ్వలంగానే ఉంటాడు
వైరుధ్యాలను వెన్నెముకగా ధరించిన నేను
ఎడారిలో వానజల్లుల రహస్యాన్ని ఏనాడో మౌనంగా స్వీకరించాను

కాలం మరెవరో కాదు నేనే

క్షణక్షణ సంహార క్రీడలో గతం, వర్తమానం, ఉదయాస్తమయాలు
ఉన్మత్త క్షేత్రాలలో రాక్షసుల ఉచ్ఛ్వాస నిశ్వాసాలు
జీవన కుడ్యాలపై ఆకలి ఆకర్ణాంత నేత్రాలు
కన్నీళ్లలో ప్రేమికుల ప్రతిబింబాలు
అన్నీ ఒకే దృశ్యం వెనుక చీకటి భస్మరాసులే!

కంటక చతురస్రాల మధ్య నిరీక్షణ అసహ్యం నాకు
నిరాశ, నిట్టూర్పులు, నిద్రారణ్యాలు నిషిద్ధం
ఆధునిక మానవుడు అనల నేత్రుడు కదా
హతుడు, హంతకుడు అతడే
క్షణ క్షణ బీభత్సాలు నా అలంకారం
ఎర్ర దీపాలే జీవన సామగ్రి

జీవన సంగ్రామంలో క్షణం ఆలస్యంగా అడుగుపెట్టిన నేను
చెట్ల ఆకులలో బీభత్సం చూశాను
మనిషి ఆలోచనలపై చీకటి అంగరక్షకుల పాషాణ హస్తాలు చూశాను
నిషిద్ధాక్షరాల మధ్య నరబలి చూశాను
ఎర్రని గాయాలపై సూర్యకిరణాల చిత్రలిపి చూశాను

భయ విభ్రమాల మధ్య విషాద వాక్యం వలె సాగే జీవితంలో
మృత్యువు ఒక్కటే నిజం
హఠాత్తుగా తలుపు తెరుచుకోవడం మృత్యువు
నడుస్తున్న రోడ్డు మధ్యలో మటుమాయం కావడం మృత్యువు
శిరస్సు తెగిన దీపస్తంభం మృత్యువు
నగర ప్రాకారాల మధ్య ఫ్యాక్టరీల జిహ్వాగ్రాల నుంచి వెలువడే నరవాసన మృత్యువు

మృత్యు గృహంలో నగ్నంగా నిలబడిన క్షతగాత్రుడిని నేనే
బాధ నా ముఖచిత్రం
బాధాగ్నిలో పునీతుడైన మనిషి పాదధూళిలో
మరణానంతరం నేను పాడే స్వేచ్ఛా గీతాన్ని రచిస్తాను
అప్పుడే నా అక్షరాలకు నిషా
అగ్ని వృక్షం క్రింద రేపు నేను మరో మనిషిని.

.978

# సుషుప్తి

ఎక్కడా ఎవరూ లేరు అంతా ఇళ్లు చేరుకున్నారు
విద్యార్థి పుస్తకాలు మూసేశాడు
వీధి గాయకుడు పాట ఆపేశాడు
ఎక్కడా ఎవరూ లేరు అంతా ఇళ్లు చేరుకున్నారు

హంతకులు కత్తులు మూలపెట్టారు
రాక్షసులు పాతాళ బిలం చేరుకున్నారు
రాజ్యాధిపతులు నెత్తురు చేతులు కడుక్కున్నారు
ఎక్కడా ఎవరూ లేరు, అంతా ఇళ్లు చేరుకున్నారు

అంతా ఒకసారి అద్దంలో ముఖం చూసుకున్నారు
అగాధంలో ఏం వుందో తెలుసుకున్నారు
మృత్యువు నోరు తెరవకముందే తలుపులు మూసుకున్నారు
ఎక్కడా ఎవరూ లేరు, అంతా ఇళ్లు చేరుకున్నారు

గుడిసెలో వెన్నెట్లో కార్మికులు కన్నీళ్లు ఆరబెట్టుకున్నారు
కటకటాల మధ్య శూన్యంలో ఖైదీలు ఆకాశయానం చేస్తున్నారు
పేవ్‌మెంట్ మీద భిక్షకులు వాల్‌పోస్టర్లు కప్పుకున్నారు
ఎక్కడా ఎవరూ లేరు, అంతా ఇళ్లు చేరుకున్నారు

పదునుకత్తెలు విష వస్త్రాలు విసర్జించారు
అశ్రుసిక్తమైన వక్షోజాలను భద్రంగా గోడలకు వేలాడదీసుకున్నారు
ఎక్కడా ఎవరూ లేరు, అంతా నిద్ర పోతున్నారు
జీవిత అవశేషాన్ని అంతా పదిలంగా నేల మాళిగలలో దాచుకున్నారు

రాక్షసులు, రాజకీయవేత్తలు, మంత్రులు, రాజ్యాధినేతలు
సామాన్యులు, సజ్జనులు అంతా నిద్రపోతున్నారు
చీకటి శరణాలయంలో అందరూ తలదాచుకున్నారు
జెండాలు ఎగరవు ఇప్పుడు
శాసనాలు చెల్లవు ఇప్పుడు
గడియారాలు ఆడవు ఇప్పుడు

ఎక్కడా ఎవరూ లేరు, అంతా నిద్రపోతున్నారు
చీకటి శరణాలయంలో అంతా తలదాచుకున్నారు
హంతకుడికీ, బలిపశువుకీ ఇప్పుడు తేడా లేదు
కురూపికీ, స్ఫురద్రూపికీ ఇప్పుడు తేడా లేదు
మనిషికీ, మనిషికీ మధ్య ముళ్లతీగ లేదు
మృత్యు భయం ఇప్పుడు ఎవరికీ తెలియనే తెలియదు
ఎక్కడా ఎవరూ లేరు అంతా నిద్రపోతున్నారు
చీకటి శరణాలయంలో అంతా తలదాచుకున్నారు

కాల సర్పాలు కుబుసం విడుస్తున్న క్షణం ఇది
కాలావధులకు అతీతంగా ఏవో అదృశ్య లోకాలు ఊపిరి పోసుకుంటున్న క్షణం ఇది
ఎక్కడా ఎవరూ లేరు అంతా నిద్రపోతున్నారు
చీకటి శరణాలయంలో అంతా తలదాచుకున్నారు

ఆలోచనల తోడేళ్లు ఎవర్నీ వెంటాడవు ఈ రాత్రి
జీవితమనే పెద్దపులి ఎవర్నీ భయపెట్టదు ఇప్పుడు
ఎక్కడా ఎవరూ లేరు, అంతా నిద్రపోతున్నారు
చీకటి శరణాలయంలో అంతా తలదాచుకున్నారు

ప్రపంచం మీద శతఘ్ని గర్జన రేపుగాని వినపడదు
భూగోళాన్ని చుట్టపెట్టే మనుష్యులు చీకట్లో ముష్టియుద్ధం చేయలేరు
యుద్ధ మేఘాల గ్రామ్‌ఫోన్ సంగీతం ఇప్పట్లో ఎక్కడా వినపడదు
ఎక్కడా ఎవరూ లేరు, అంతా నిద్రపోతున్నారు
చీకటి శరణాలయంలో అంతా తలదాచుకున్నారు

పోస్టు బంట్రోతుల భయం ప్రొద్దున్నేగాని ఇప్పుడు లేదు
హంతకుడు పోస్టు చేసిన ఉత్తరం రేపుగాని అందదు
దేశాలపాలైన కొడుకుల సంగతి ఏ తల్లినీ ఇప్పుడు కలతపెట్టదు
మిత్రుడు ద్రోహం తలపెట్టినా ఇప్పట్లో అది ఎవరికీ తెలియదు
ఎక్కడా ఎవరూ లేరు, అంతా నిద్రపోతున్నారు
చీకటి శరణాలయంలో అంతా తలదాచుకున్నారు

ఆశలు లేవు, అసూయలు లేవు, నిరాశలు లేవు
నిట్టూర్పులు లేవు, ద్వేషాలు లేవు, దురాగతాలు లేవు
కష్టాలు లేవు, కన్నీళ్లు లేవు
అంతటా ఒకే ఒక నిశ్శబ్దం
ఒకే ఒక హృదయ స్పందనం.

1954

# రోడ్లకు నమస్కారం

నేను మాట్లాడే భాష వేరు
మృత్యువాంఛ ప్రజ్వరిల్లుతున్నవేళ మనిషి అంతరాంతరాలలో
రహస్య ద్వారాలు నోరు తెరుస్తున్న హోరు
నేను వ్రాసే కవిత్వం వేరు
శిరస్సు బద్దలై ప్రవహిస్తున్న సెలయేరు

అక్షర హింస కవిత్వం కాదు కనుక
అక్షర హర్మ్యాలలో ఉన్మత్తుని ఖడ్గ విన్యాసాలు ఆత్మహత్యాసదృశం కనుక
ప్రచ్ఛన్న రాక్షసులకు దూరంగా
రోడ్ల మీద నడుస్తూనే నేను కవిత్వం వ్రాస్తున్నాను

రోడ్లు నా ప్రాణం
నేను అన్వేషిస్తున్న రహస్య జగత్తు రక్తనాళాలు అవే
నరక ద్వారాల మధ్య మనిషి అంతర్నేత్రాలు చూడాలని ఉన్నదా?
మనిషిలో మనిషి సంభాషణ వినాలని ఉన్నదా?
సుడిగాలి సృష్టిస్తున్న నా చేతులను స్పృశించాలని ఉన్నదా?

రోడ్లు నా రహస్య సంకేతాలు
అదృశ్య హంతకులను సూర్య కిరణాలు శిక్షిస్తున్నవేళ
రోడ్ల భుజస్కంధాలపై స్వేద బిందువులలో
నీ ప్రతిబింబం ఒకసారి చూసుకో

రోడ్లు నా జీవన వ్యాకరణం
నడుస్తున్న ప్రతి మనిషి నన్ను ప్రతిబింబిస్తున్న వాడే
ఒకే భాష, ఒకే ఘోష, ఒకే ఆకారం, ఒకే ఆత్మకథ

స్వప్న ఖచితమైన నా శరీరాన్ని రోడ్లకే అంకితం చేశాను కదా
నా వెన్నెముక పొడవునా యుగయుగాల పాదపద్మాలు
జెండాలు, నినాదాలు, జైళ్లు, సంకెళ్లు, ఆకలి కర్మాగారాలు, మృత్యువు శయ్యాగారాలను చీల్చుకొని
సహస్ర ఖడ్గాలుగా విస్తరించిన నా బాహువులపై అడుగడుగునా నేనే

నా చుట్టూరా మనుష్యులు
మనుష్యులను కబళిస్తున్న మనుష్యులు
సుఖదుఃఖాల మధ్య నిర్లిప్తంగా నడుస్తున్న మనుష్యులు
అరచేతులలో ఎడారులను మోసుకొని వస్తున్న మనుష్యులు
శిక్షా వాక్యాలవలె నిలబడిన భవనాలలో మనిషి భవిష్యత్తును ఉరితీస్తున్న మనుష్యులు
కన్నీళ్ల వలె మెరుస్తున్న మనుష్యులు
రగులుతున్న గాయం నుంచి నెత్తురు చుక్కలవలె రాలుతున్న మనుష్యులు
అంతా నన్ను చీల్చుకుని వస్తున్న వాళ్లే
నా కన్నుల వెనుక రహస్య జలపాతాలను ఛేదించుకొని వస్తున్నవాళ్లే

రోడ్లు నా సర్వస్వం
నగరారణ్యాలలో అర్థరాత్రి భయంకరాట్టహాసాలు వినాలని ఉన్నదా?
మనిషి సింహ సదృశుడుగా మారుతున్న దృశ్యం చూడాలని ఉన్నదా?
భ్రాంతిని సంహరిస్తున్న నా చేతులను స్పృశించాలని ఉన్నదా?
రోడ్లు మలుపు తిరుగుతున్నచోట శిలా విగ్రహాల హెచ్చరిక ఒకసారి వింటే చాలు
వంతెన క్రింద నీళ్లలో కలల అలలపై నీ ప్రతిబింబం ఒకసారి చూసుకో

రోడ్లు నా ఇతివృత్తం
చీకటి హాలాహలాన్ని ఆస్వాదిస్తున్న వీథి మహర్షి నా కావ్య నాయకుడు

నే నెవరో తెలుసా
నాపై విషాద మేఘాలు రువ్వుతున్న వారెవరో తెలుసా
నన్ను వాగ్బంధనం చేస్తున్న వారెవరో తెలుసా
నన్ను రహోబిలంలో పడద్రోస్తున్న వారెవరో తెలుసా
నా మస్తిష్కాన్ని కాటువేస్తున్న వారెవరో తెలుసా
జీవన సౌరభాన్ని నడివీథిలో వేలం వేస్తున్న వారెవరో తెలుసా
మేఘచ్ఛిన్నమైన ఆకాశం క్రింద రోడ్ల పొడవునా
శిథిల వృక్షాలకు నమస్కారం చేస్తున్న పరివ్రాజకుడా
విధ్వంసక యంత్రాలను ఆలింగనం చేసుకుంటున్న సాహసికుడా
నీ చేతులను నీవే ఉరిత్రాళ్లుగా మార్చుకుంటున్నవాడా
నీవు మరెవరో కాదు నేనే
నన్ను వెంటాడుతున్న దారుణ మారణ జ్వాలా హస్తాలను హతమార్చగలనా నేను?
మనిషి నిర్మిస్తున్న రాక్షస నగరంలో అతడే కాదు నేను కూడా ఒక ఖైదీనే.
న్యాయ పీఠాల మధ్య విషభాండంలో
మనిషి పాదాల క్రింద పాపభూయిష్ఠమైన భస్మరాసులలో
నేను కూడా ఉన్నాను

రోడ్లు నా ఛందస్సు
శిరస్సు బద్ధలై ప్రవహిస్తున్న స్వప్న జలాలలో స్వచ్ఛమైన మనిషి ఒక క్షణం సాక్షాత్కరించినా చాలు
రెండు రోడ్లు కలసికొంటున్న చోట ఏదో కొత్త స్పృహ
కొత్త భాష ఆవిర్భావం అక్కడే
ధూళి వృక్షాలు రాల్చిన అక్షర కుసుమాలను అలంకారంగా ధరిస్తాను
రోడ్లు నా నిఘంటువు, నా అక్షర ప్రపంచం అదే.

1980

# కంప్యూటర్ చిత్రాలు

గోడలపై జారుతున్న నీడలలో బీభత్సం ఎన్నడైనా చూశావా
నీవు గోడతో మాట్లాడుతున్నావు
సంకెళ్ళ పడిన చేతులను స్పృశిస్తున్నావు
తిరుగుబాటు ప్రకటించిన గుండె తలుపులు తట్టుతున్నావు
కన్నీళ్లలో దీపం వెలుగుతుందా?
రక్తసిక్తమైన పెదవులపై అక్షర శతఘ్ని మోగుతుందా?
ప్రశ్నకు సమాధానం ప్రశ్న
పెద్దపులి గుండెలలో కత్తులు విసురుతున్న మనిషిని నేను, జీవన క్షేత్రం అదే
ఒక్క క్షణం చాలు
అనంత శూన్యంలో శాశ్వత విశ్రాంతి, లేదా విక్రాంతి
ఆ తర్వాత మరి గోడ కనపడదు

సుడిగాలిలో ఎండుటాకుల సంభాషణ ఎన్నడైనా విన్నావా?
నీవు నీడతో మాట్లాడుతున్నావు

అసుర సంధ్యవేళ అద్దంలో ఒక రోజు నా ముఖం చూసుకున్నాను
రెండు ఖండాలుగా చీలిన ప్రతిబింబం వెనుక ఎవరో ఉవ్వెత్తుగా లేచిన మనిషి
విచ్చుకత్తులవలె మెరుస్తున్న అతని చేతులలో నా ఖండిత శిరస్సు
మృత్యుముఖంలోనే కదా మనిషి విజృంభణ
గగన వేదికపై అస్తంగత సూర్యుడు నిజంగా ఎంత అందం!

నడుస్తున్న వృక్ష కన్యక పదఘట్టన ఎన్నడైనా విన్నావా?
నీవు శూన్యంతో మాట్లాడుతున్నావు

ఆశ, నిరాశ ఎదురైనప్పుడు
రెండు అస్థిపంజరాలు నవ్వుతున్న చప్పుడు
చల్లని హస్త స్పర్శ మృత్యువు కావచ్చు, స్వప్న కన్యక ఆలింగనం కావచ్చు
నిషిద్ధ నగరంలో క్రోధాగ్ని నేత్రాలను సమీకరిస్తున్న మనిషిని నేను
జీవన వేదికపై మనిషి శిలావిగ్రహంగా మారుతున్న దృశ్యం చూడలేను, చూడలేను
నిత్యం అదే జీవితం, అదే రోడ్డు, అదే గోడ, అదే గడియారం, అవే ముఖాలు దుస్సహం, దుర్భరం
దృశ్యం మారకపోతే నిష్క్రమణ, లేదా ఖడ్గధారణ

మీట నొక్కగానే తర్జని రివాల్వర్‌గా మారుతుందా?
నీవు అగ్నితో మాట్లాడుతున్నావు

ఛద్మ వేషధారుల ప్రపంచం ఇది, అంతా ముసుగు వేసుకున్నవాళ్లే
అక్షరాలకు ముసుగు, ఆలోచనలకు ముసుగు
ముఖం వెనుక మరో ముఖం, స్వచ్ఛమైన సూర్యోదయాలను అంతా భూస్థాపితం చేసుకున్నవాళ్లే
నడి వీధిలో జీవన బీభత్సాన్ని ఆవిష్కరిస్తున్న మనిషి తనకు తానే అపరిచితుడు
చీకటిని రసప్లావితం చేస్తున్న హంతకుడు కూడా అపరిచితుడే
అందమైన ఆచ్ఛాదన వెనుక రాక్షసుల కరస్పర్శలో ఎంత బీభత్సం!

ఆకలి విష కౌగిలిలో రహస్య సముద్రాల హోరు ఎన్నడైనా విన్నావా?
కొత్త నేత్రాలు ధరించిన మనిషితో నీవు మాట్లాడుతున్నావు

వర్షధారల మధ్య అన్వేషణ ఎంతో ఇష్టం నాకు
గడియారాలపై వాన, చీకటి శతాబ్దాలపై వాన, వధ్య శిలలపై వాన, నడుస్తున్న దీపస్తంభాలపై వాన
శిథిల ప్రాంగణాలలో ప్రాచీన విహంగాల రెక్కలపై వాన, ఊపిరి విడుస్తున్న మృత శరీరాలపై వాన
నగర దేవత వక్షోజాలపై వాన, వాగ్దేవి కన్నులలో వాన
వర్ష బిందువులలో జీవన రహస్యం ప్రతిఫలిస్తుందా?
ఎక్కడో, ఎప్పుడో జారవిడిచిన ఆలోచన మళ్లీ పరిమళిస్తుందా
ప్రశ్నకు సమాధానం ప్రశ్న
పెద్దపులి గుండెలలో కత్తులు విసురుతున్న మనిషిని నేను
అక్కడే శాశ్వత విశ్రాంతి, లేదా విక్రాంతి.

1982

# క్షుద్ర సంధ్య

అప్పుడే వికసించిన అక్షరం మీద చీకటి
రెండు ఆలోచనలు వివృతం కావడంలో చీకటి
దైనందిన జీవన మహీరుహం క్రింద
ఎటు చూసినా ఖండిత హస్తాల సంఘర్షణలే కదా
గాయపడిన స్వప్నాలు కాంతిని ఎలా వెదజల్లగలవు?

రెండు హృదయాలు తెరుచుకుంటున్నప్పుడు చీకటి
ఇద్దరు ప్రేమికులు నవ్వుతున్నప్పుడు చీకటి
ఎడద వాకిట అనురాగ వేదికపై తోడేళ్లు అధివసించినవి కదా
భయవిదగ్ధమైన కంఠాలు అగ్నిగీతాలు ఎలా ఆలపించగలవు?

అశ్రువులు ఘనీభవించిన చోట
ఖడ్గ కన్యక పాదాల ముందు ఆకలి రుద్రభూమిలో
ఖండ ఖండాలుగా మనిషి తనను తానే హననం చేసుకుంటున్న చోట
జీవన సౌందర్యాన్ని ఎలా చూడగలం?

మిత్రుడా, శాశ్వతంగా మోసపోయాను నేను
జీవితం నిండా ఎండుటాకులు రాలుతున్న చప్పుడు
కాలచక్ర పరిభ్రమణాన్ని ఒక్క క్షణమైనా ఆపగలనా నేను?
గడిచిన దినాల వర్షపాతంలో చిద్రుపలైన నా ముఖాన్ని
పునఃప్రతిష్ఠితం చేసుకోగలనా నేను?
మిత్రుడా, శాశ్వతంగా నిష్క్రమిస్తున్నాను

నపుంసకుని స్వప్నం వలె
దీనంగా, హీనంగా, రజో విహీనంగా ఉన్నది, చీకటి ఊరువులపై
నెత్తురు క్రక్కుతున్న క్షుద్ర సంధ్య

నిట్టూర్పుల వలయాల వెనుక చీకటి వక్షోజాలపై
నక్షత్రాలు ప్రతిఫలించవు కదా
నేను ప్రాతినిధ్యం వహిస్తున్న మనిషి పుట్టుకతోనే శప్తుడు
అతని కన్నుల వెనుక సూర్యోదయాలను
ఎప్పుడో, ఏనాడో, ఎవరో అపహరించారు.

1978

# చెట్లు కూలుతున్న దృశ్యం

ఆశ లేదు, ఆస్కారం లేదు
ఫలానా రోడ్డు గమ్యం చేరుస్తుందనే సూచన ఎక్కడా లేదు
జీవితం ఎప్పుడూ ఇలా కన్నీళ్ళ ప్రవాహంగానే సాగుతుందనుకుంటాను
రోడ్డు పొడుగునా చెట్లు కూలుతున్న దృశ్యాలనే చూపుతుందనుకుంటాను
లేకుంటే ఎంతో అందమైన సాయంత్రం కదా ఇలా అపస్వరాలు వినపడడం జరగదు
రోడ్ల మీద ధూళి, దారిద్ర్యం సమస్తం మిత్రుడు వెంకట్రావు ముఖం మీదనే పరవళ్లు తొక్కడం జరగదు

ఐతే ఇప్పుడు నిర్ధారణగా చెప్పుకోవచ్చు
మిత్రుడు వెంకట్రావు నిరుద్యోగి అని రూఢిగా చెప్పుకోవచ్చు
తలక్రిందులైన స్వప్నం మీద శల్యాకారంగా కూర్చున్న కుర్రవాడు
ఆపాదమస్తకం సూదులతో ముస్తాబై ఉన్నవాడు
అతని ముఖం నిండా స్ఫోటకం మచ్చలు
కళ్లలో శిలావిగ్రహాల వీక్షణలు
అతని చుట్టూ పరాజయ భారంతో క్రుంగుతున్న వృక్షాలు

ఇదే దృశ్యాన్ని ఇంకా భారీ ఎత్తున భూతద్దాలతో చూడవచ్చు
వినీల గగనాల క్రింద విషాదాగ్ని ఆవిర్భావాన్ని కళ్లారా చూడవచ్చు
మిత్రుడు వెంకట్రావు ఎక్కడ ఏ భంగిమలో తనను తాను ఆహుతి చేసుకుంటున్నాడో ఊహించుకోవచ్చు
ప్రస్తుతం వెంకట్రావు నివాసం ఆకాశం క్రిందనే

నిరుద్యోగి వెంకట్రావు నగరం నడి వీధిలో తన జీవితాన్ని ఆవిష్కరిస్తుంటే
ఎందుకో అకారణంగా సూర్యుడు ఖిన్నుడౌతాడు
చెట్ల మీద ఆకు సైతం అల్లల్లాడదు
టెలిఫోన్ తీగలలో వార్తా ప్రసారం సాగదు

నిరుద్యోగి వెంకట్రావు గాలిలో ధూళిలో ఎండుటాకులా సుడిగుండం తిరుగుతుంటే
గృహస్థులు ఆ రోజు సన్యాసం స్వీకరిస్తారు
పిల్లలు గల తల్లులు బావిలో దూకుతారు
విద్యార్థులు నడివీధిలో పుస్తకాలు తగులబెడతారు

నిరుద్యోగి వెంకట్రావు నగరం గుండెలలో సాలీడులా అల్లుకుంటూ ఉంటే
ప్రభుత్వ భవనాలలో ఎవరికీ ఒక క్షణం పాటు ఊపిరి ఆడదు
కలం కాగితం పట్టుకున్న అధికారి తనంత తానే రాజీనామా పత్రం మీద సంతకం పెడతాడు
ప్రభుత్వ భవనాల మీద జెండా సిగ్గుతో తల వాల్చుకోవచ్చు

నిరుద్యోగి వెంకట్రావు తన ఆకలిని రాళ్లలో రప్పలలో దాచుకుంటూ ఉంటే
రాజకీయవేత్తలు వాటిని వేలం పాటలో కొనుక్కుంటారు
విషాదం రంగు ఎలా ఉంటుందో తెలుసుకొనేటందుకు
కవులు, చిత్రకారులు అతని కన్నీళ్లపై పరిశోధనలు చేస్తారు
అతని పాద ధూళిలో చీకటి పుట్టుపూర్వోత్తరాలు వెతుకుతారు

నిరుద్యోగి వెంకట్రావు తన బాల్య స్మృతులు తలుచుకుంటూ ఉంటే
నగరంలో పసిపిల్లలు ఆ పూట అన్నం ముట్టరు
పువ్వులు కోసుకుంటున్న పిల్లలను పాము కరిచినా ఆశ్చర్యం లేదు
దొడ్లో గున్నమామిడి చెట్టు నేలకూలడం వైపరీత్యం కాదు

నిరుద్యోగి వెంకట్రావు ఈ నగరం మీద ఒక మచ్చ
బాధ అనే దీపం పట్టుకుని
సర్వ నాశనం అనే తాళం చెవి పట్టుకుని
వెంకట్రావు జీవితం అనే చీకటి నరక కూపంలో
భయంకరమైన ఆశ్చర్యాలు ఇంకా అనేకం చూడవచ్చు
జీవితం మీద నమ్మకం ఉన్నవాడు వెంటనే అక్కడే ఉరిపోసుకుని చావడం సంభవం కావచ్చు

నిరుద్యోగి వెంకట్రావు ఈ నగరం మీద ముమ్మాటికీ ఒక మచ్చ
నిరుద్యోగి వెంకట్రావు చావడు
చావడం అనే మహాపాపం చెయ్యకుండా
న్యాయాధిపతులు ఎల్లవేళలా అతన్ని కాపాడుతూనే ఉంటారు
రోడ్ల మీద భిక్షకులు సైతం అతనిలో కొత్త ఊపిరి పోస్తూ వుంటారు
జీవన మాధుర్యాన్ని గూర్చి చిన్న చిన్న చీమలు సైతం అతన్ని హెచ్చరిస్తాయనడంలో అతిశయోక్తి లేదు

నిరుద్యోగి వెంకట్రావు ఎన్నటికీ చావడు
అందుకే అందమైన సాయంత్రం వేళ నగరం అంతటా అపస్వరాలు
వెంకట్రావు నడుస్తున్నంత మేరా చెట్లు కూలుతున్న దృశ్యాలు

1954



# పరిత్యాగి పరివేదన

తమ్ముడూ కులాసాగా ఉన్నావా
పోనీ నీవైనా పుస్తకాల పూజ చేస్తున్నావా?

అమ్మనీ, నాన్ననీ హింస పెట్టకుండా
వాళ్ల కన్నీరై ప్రవహించకుండా
పోనీ నీవైనా కుటుంబానికి పేరు తెస్తున్నావా?

అప్పుడే ఎన్ని ఉగాదులు వచ్చి వెళ్లాయో
అడుగడుగునా నాకు ఎన్ని గండాలు గడిచాయో వివరంగా చెప్పలేను గాని...

ఎప్పుడు ఏ క్షణం ఆకాశం నా మీద విరుచుకుపడుతుందో
ఎప్పుడు ఏ రోజు ఎలక్ట్రిక్ స్తంభం నా మెడకు చుట్టుకుంటుందో
ప్రస్తుతానికి మాత్రం ఈ చిన్నసైజు నరకంలో కులాసాగానే ఉన్నాను

నీకు ఎంతో దూరంగా ఎక్కడో సమానాంతర రేఖపై నిలబడిన నేను
నన్ను నేనే పోల్చుకోలేక నాకు నేనే సహస్ర యోజనాల దూరంలో ఉన్నాను
నా వాతావరణం మీద నేనే పొగలాగ వ్యాపించుకుపోయాను

రాత్రివేళ స్వప్న కన్యకలను భూస్థాపితం చేయడం ఒక్కటే
ఇటీవల నా కార్యక్రమం
ఐనా, నా అడుగుజాడ ఏ సారవంతమైన శ్మశానం మీద పడుతుందో
ఇంకా నిర్ధారణగా చెప్పలేను

ఈలోగా ఈ వైపరీత్యాలు మాత్రం నీవు వినక తప్పదు
నిత్యం నన్ను వెంటాడుతున్న భయాలను చెప్తేనేగాని నా భయం తగ్గదు
అద్దంలో నా ముఖం చూడడానికే నాకు భయం
నా సంతకంలో అక్షరాలు చూస్తేనే నాకు చెప్పలేనంత భయం
నా చూపుడు వేలు నిత్యం భయాలవైపే...

ముఖ్యంగా ఒక విచిత్రం చెప్తాను విను,
నేను రోడ్డు మీద నడుస్తున్నప్పుడు ఎవరైనా ప్రమాదంలో చిక్కుకున్నారనుకో
చుట్టూ నిలబడిన జనం నా వైపు విచిత్రంగా చూస్తారు
''ఇదేం విచిత్రం ఇద్దరిదీ ఒకే పోలిక'' అని ఆశ్చర్యపోతారు
అంతదాకా దేనికి, రోడ్డు మీద నా మృతకళేబరాలను నేనే లక్షసార్లు చూశాను

నమ్ముతావో నమ్మవోగాని తమ్ముడూ నిజం చెపుతున్నాను
ఈ నగరంలో అడుగుపెట్టిన రోజున సూర్యుడు నెత్తురు క్రక్కడం కళ్లారా చూశాను
అంతటా విషవాయువులు, ఎటు చూసినా పద్మవ్యూహాలు
కళ్లలో దుమ్ముచల్లే రోడ్లు, చూస్తూ చూస్తుండగానే మనిషిని మటుమాయం చేసే మనుష్యులు
అంతా ఒక మహా మాయ

ఐనా ఇప్పుడు గతాన్ని త్రవ్వుకుని ఏం లాభం?
చేసుకున్న నిర్ణయాలను మార్చుకోవడం సాధ్యం కాదు కదా
కష్టసుఖాల తిన్నె మీద దీపం పెడుతూ అమ్మచెప్పిన మాట విన్నాను కాదు
దీపం క్రింద క్రీనీడలో కీడు చూశాను కాదు
స్వహస్తాలతో సృష్టించుకున్న నరకకూపాన్ని కూలద్రోయడం సర్వకల్ల
జీవితం నిండా ఇక శూన్యమే

బహుశా ఇప్పుడు గుర్తుకు రాదు నీకు
ఒక రోజు సాయంత్రం అమ్మనీ, నాన్ననీ కన్నీళ్ల పర్యంతం చేశాను
అప్పుడు పదేళ్లయినా లేవు నీకు
క్రమ్ముకువస్తున్న చీకట్లలో కన్నీళ్లు రాల్చుతూ చెప్పారు
నువ్వే మా కష్టాలకు వంతెన అన్నారు
అదే నిన్ను చూడడం ఆఖరి రోజు నాకు
వాళ్ల ఆశను మొక్కగా ఉన్నప్పుడే త్రుంచేశాను
వాళ్లను అక్షరాలా కన్నీరుగా మార్చేశాను

ఇంద్రధనుస్సుల సౌందర్యాన్ని ఆరాధిస్తూనే
అసత్యాల అరణ్యంలో చిక్కుకుపోయాను
గగన కుసుమ సౌరభం క్రింద స్పృహతప్పి పడిపోయాను

ఇలా ఎంతసేపైనా బాధ జాజ్వల్యమానంగా  వెలగవచ్చు
ఇలా నా కథ సహస్రాక్షరాల దూరం సాగవచ్చు
ఐనా, ఏదో ఆశ
ఎప్పటికైనా మంచి రోజులు రాకపోవా అని, ఈ నిశ తొలగిపోదా అని.
తమ్ముడూ ఈ ఆశనే వాళ్లకు చూపించు
నా పేర ఇంట్లో ఒక క్షణం శాంతిని ప్రతిష్ఠించు
అమ్మనీ - నాన్ననీ ఒకసారి చల్లని హస్తాలతో నన్ను దీవించమను
చల్లని వేళ నా కోసం భగవంతుడిని ప్రార్థించమను.

**1951**

# వక్రరేఖ

ఒక సంజ్ఞ చాలు, వక్రరేఖపై ఒక ప్రకంపన చాలు
స్వప్నారణ్యాలలో ఒక క్షణం అలజడి చాలు
మౌన ముద్ర ధరించిన పెదవులపై ఒక మేఘశకలం చాలు
తర్వాత అంతా బీభత్సం, బీభత్సం

అదృశ్య నేత్రాలు అగ్ని వర్షించగా భస్మ వేదికపై నీ ఎదుట నీవే అప్పుడు సహస్ర రూపాలలో ప్రత్యక్షం కావచ్చు

నీవు రాక్షసుడుగా మారవచ్చు

శూన్యసముద్రాలలో భయోత్పాతం సృష్టించిన జ్ఞాపకాలు వెంటాడగా, వెంటాడగా
క్షతగాత్రుడై ధూళి మేఘావృతుడైన మనిషి మృత్యుఘోష వినా
మరేదీ అప్పుడు వినపడదు నీకు

మిత్రుడా నేరం చేశాను
నిశ్శబ్ద సింహాసనం మీద శిరస్సు వ్రయ్యలై అపశబ్దాల మధ్య నన్ను నేనే అపవిత్రం చేసుకున్నాను
మంత్ర దర్పణంలో భద్రంగా దాచిన నా ప్రతిబింబాలను చేజేతులా నేనే అన్యాక్రాంతం చేశాను

మిత్రుడా నేరం చేశాను, మిత్రుడా ఘోరం చేశాను
అదృశ్య ప్రాకారాల వెనుక రహస్యోద్యానవనాలలో వికసించిన చిత్రాక్షరాలను చీకటి నఖాగ్రాలతో చిత్రవధ చేశాను

నా అరచేతులలో నిక్షిప్తం చేసిన సూర్యరశ్మిని చేజేతులా నేనే రాక్షస నగరంలో భస్మీపటలం చేశాను

మిత్రుడా నేరం చేశాను, మిత్రుడా పాపం చేశాను
చంద్రోదయ వేళ నృత్య మంటపంలో రాక్షసుల నాట్యహేల
దారుణం, దారుణం కారణం నేనే

శిక్ష తప్పదు
స్మృతిపథంలో ఒకే ఒక నెత్తురుజాడ చెరుగుతుందా
ఉద్రిక్త మైదానాలలో ఉన్మత్త మృదంగ ధ్వని ఆగుతుందా
దారుణం దారుణం ఉన్మాదిని నేనే

శిక్ష తప్పదు
మోహినీ వృక్షం క్రింద విషసర్పాలుగా మారిన నా చేతులను వ్యధాగ్ని జిహ్వికలపై దగ్ధం చేస్తున్నాను
మంత్ర దర్పణంలో నా అక్షరాలు ఇక కనపడవు
మిత్రుడా మృత్యువు ప్రాణ రహస్యం ఎక్కడో చెప్పగలవా

ఒక సంజ్ఞ చాలు, వక్రరేఖపై ఒక ప్రకంపన చాలు
స్వప్నారణ్యాలలో ఒక క్షణం అలజడి చాలు
తర్వాత అంతా బీభత్సం, బీభత్సం.

1985



# అనామిక

మహా సర్పాలు మాట్లాడవు
మహా వృక్షాలు మాట్లాడవు

జీవన వ్యూహంలో మహా సర్పం వలె ప్రవేశించిన
ప్రచండమైన ఆలోచన వెనుక
అన్నీ ప్రశ్నలే అని కదా నీ ప్రశ్న

మహా సర్పాలు మాట్లాడవు
మహా వృక్షాలు మాట్లాడవు

వేసవిని సంహరిస్తున్న వర్ష బిందువులలో
మంత్రమయ శబ్దాలను చిత్రీకరిస్తున్న నా వ్రేళ్ల
విశ్వాంతరాళంలో వెదజల్లుతున్న కఠోర సత్యాలను వినగలవా?
అప్పుడు నీవే ఒక ప్రశ్న

మహా సర్పాలు మాట్లాడవు
మహా వృక్షాలు మాట్లాడవు

స్వప్నావధులకు అతీతంగా ఊర్ధ్వరేఖపై
ఒకే ఒక ఉజ్వల నేత్రం నిశ్చలం, నిశ్చలం.

1988

# స్వప్న లిపి

ద్రవిస్తున్న గడియారాలతో నిమిత్తం లేదు, జీవన సంఘర్షణలో ఉజ్వలమైన క్షణం ఒక్కటే,
నిజం గ్రహిస్తున్నాను, వాస్తవం వెనుక అధివాస్తవంలో మనిషి ముఖంమీద స్వప్నలిపి చూస్తున్నాను
మనిషి భుజస్కంధాలపై ఉగ్రవిహంగాలను చూస్తున్నాను
మేదిని చెరసాలలో రహస్య సంగ్రామం చూస్తున్నాను

చీకటిని చీల్చుకుని,
స్లోమోషన్‌లో దూసుకుని వస్తున్న బులెట్‌పై అడవి పువ్వుల పరిమళంలో స్వప్న బీభత్సాలను
అలంకారంగా ధరిస్తున్న సాహసికుడు ఎవరో!

మిత్రుడా, ఇప్పుడు నేను నీ స్వప్నంలోనే ఉన్నాను
స్వప్న శక్తి విజృంభణలో సంకెళ్ళు తెగుతున్న చప్పుడు వింటున్నాను
అధః పతితుడైన మనిషిని ఆప్యాయంగా లేవనెత్తుతున్న కారుణ్య హస్తాలలో పృథ్వి పునర్వికసిస్తున్నదా?
మిత్రుడా, నీ పేరు అగ్ని; నీ వ్రేళ్లపై ప్రజ్వరిల్లుతున్న వైశ్వానరగోళాలలో ఒక క్షణమైనా అడుగుపెట్టగలనా నేను?

రాజకీయ భాష్యకారులైతే నీ ముఖంమీద ప్రశ్నార్థకాలు చిత్రించవచ్చు గాక!
కాని, నేను మాత్రం నిన్ను 'క్రియేటర్, క్రియేటర్' అని అంటాను
'డిస్ట్రాయర్' అని కూడా అంటాను
చీకటి నిబర్హణం తర్వాతనే కదా కొత్తసృష్టి, కొత్త ప్రపంచం!

మిత్రుడా, నీలో ఒక పాటనై ప్రతిధ్వనించడానికి నా శేషజీవితం చాలుతుందా?
ఈలోగా నా శబ్ద శరీరం మీద ఆచ్ఛాదనలన్నీ విసర్జిస్తున్నాను శాశ్వతంగా
నగ్నాక్షరం కూడా ఒక ఆయుధమే.

1992

# చీకటి చిత్రశాల

నా నివాసం ఎక్కడో శూన్యంలో చీకటి పాషాణాలపై స్వప్న శృంఖలాలలో కావచ్చు గాక
కాని, శూన్యంలో చీకటి ప్రజ్వలనం నేను చూశాను
చీకటి ప్రజ్వలనంలో నిర్జీవ ప్రతిమ ఖడ్గ నాట్యం చూశాను
నేను సజీవంగానే ఉన్నానా?
అశ్రుదగ్ధమైన నీడలలో నా ప్రతిధ్వని మళ్లీ ఎప్పుడు వినగలనో మరి

శూన్యంలో నడుస్తున్నాను
చీకటి ప్రవల్లికలలో నడుస్తున్నాను
చీకటి అంతరాంతరాలలో హంతకుడు సృష్టిస్తున్న విధ్వంసక శబ్దాలలో నడుస్తున్నాను
నేను సజీవంగానే ఉన్నానా
ప్రజ్వరిల్లుతున్న అడవులలో నా పదఘట్టన మళ్లీ ఎప్పుడు వినగలనో మరి

శూన్యంలో నడుస్తున్నాను
చీకటి అగాధాలలో నడుస్తున్నాను
చీకటి మృత్యుశిలలపై స్వప్నధూళిలో నడుస్తున్నాను
నేను సజీవంగానే ఉన్నానా
మరో జీవన ద్వారం తెరుచుకోవడమేనా మృత్యువు అంటే?
ధ్యాన నిమగ్న స్థితిలో ఉన్న అగ్నిసర్పం మళ్లీ ఎప్పుడు కన్ను తెరుస్తుందో మరి
నా శిరస్సుపై.

1975

# వేళ్లు ఇక్కడే...

అద్దె ఇంట్లో గోడ మీద క్రిమికీటకాలు సరే, ఆ ప్రక్కనే విఘ్నేశ్వరుడు, రవివర్మ చిత్రాలు సరే, కాని అవన్నీ తర్వాత...

ఉదయం నిద్ర లేవగానే, సూర్యబింబాన్ని ఒకసారి నా వైపు త్రిప్పుకొని, మా ఆవిడ పాదాల వైపు చూస్తాను పువ్వులు చల్లుతున్నట్టు; వృద్ధాప్యంలో తల్లి తర్వాత తల్లి; ఇప్పుడు నేను బ్రతుకుతున్నది ఆమె చేతులలోనే; సుఖ దుఃఖాలలో తడిసిన ఆమె చేతులను ఆప్యాయంగా ఒకసారి స్పృశిస్తాను; ఆమె స్పర్శలో, సాహచర్యంలో మృదువైన ఆమె వేళ్ల నుంచి ప్రసరిస్తున్న జీవశక్తిని కన్నుల నిండా నింపుకొని, తడబడుతున్న అడుగులతో నా ప్రపంచంలో అప్పుడు అడుగు పెడతాను.

అతి సామాన్యమైన ప్రపంచం; వేసవిలో వేపచెట్టు గాలిని సంకేతంగా పేర్కొనవచ్చునేమో! గదిలో ఒక మూల చీకటి నీడలలో స్వర్గీయులైన మా తల్లితండ్రుల ఫోటోలు; వాళ్ళ కట్టు, బొట్టు నియమం, నిష్ఠ, సాంప్రదాయ బద్ధమైన వాళ్ల జీవితాలను తలుచుకోవడం నిజంగానే ఒక ముచ్చట; గదిలో గోడవారగా ఒక చోట పెద్ద భోషాణం; ప్రక్కనే సందుగ పెట్టె; వంశపారంపర్యంగా వస్తున్న వ్యాస పీఠం మీద భారత రామాయణాలు, పంచకావ్యాలు, పెద్ద బాలశిక్ష- అవన్నీ ఇప్పటికీ మాకెంతో అపురూపం; ముఖ్యంగా మా అమ్మగారు భగవద్గీతలో భద్రపరిచిన ఇందిరా వికాస పత్రాలను తలుచుకుంటే నాకు కన్నీళ్లు ఆగవు; కుటుంబ క్షేమం కోసం ఒక తల్లి ఆరాటంలో దైవత్వం చూశాను; ఇప్పుడు మా ఆవిడ కన్నులలో చూస్తున్నాను.

మా ఇంట్లో అంతా సరస్వతీ ప్రసన్నులే; కాని సిరి అంటలేదు; దైనందిన జీవితం ఎంత దుర్భరంగా ఉన్నా, సూదులు గుచ్చుతున్నట్టు ఎంత బాధాకరంగా ఉన్నా, పిల్లల మీద మాత్రం ఆ నీడ పడనివ్వలేదు; కాని ఒక్కటే బాధ...

మాస్టర్ డిగ్రీ చేతపట్టుకుని ఇల్లు విడిచిన మా జ్యేష్ఠ పుత్రుడు, మళ్లీ ఇంతవరకు మా కళ్ల పడలేదు; జీవితానికి కొత్త అర్థాలు వెతుకుతున్నట్టు యజ్ఞోపవీతంతో పాటే డిగ్రీలన్నీ గంగార్పితం చేసినట్టు ఒకసారి మాత్రం ఉత్తరం వ్రాశాడు; తర్వాత జాడ తెలియదు; ఎక్కడో బాధిత జన హృదయాలలో సంచరిస్తున్నట్టు కర్ణాకర్ణిగా విని ఎంత కంపించిపోయానో; ఎప్పుడు, ఏరోజు ఏ దుర్వార్త విరుచుకు పడుతుందో అన్నదే ఇప్పుడు నా భయం, మౌనంగా ఒక నిట్టూర్పు విడుస్తాను.

మా ద్వితీయుడు కూడా చదువులో ఘటికుడే, మాటలలో తీవ్ర ఉష్ణోగత ప్రత్యేక ఆకర్షణ; "ఎవడు బతుకుతాడు చీకటి గదులలో, ఎవడు బతుకుతాడు సంకెళ్లలో, అది బతుకే కాదు"... నిజం, నిజం, నిజం; వాడు ఇంట్లో ఉన్నంతసేపు సుడిగాలి వీస్తున్నట్టే; యూనివర్శిటీ ప్రాంగణం ఇంకా దాటలేదు కనుక ప్రస్తుతానికి వాడు సురక్షితుడే...

ఇక ఆడపిల్లలంటారా, వాళ్లదంతా ఇంద్ర ధనుస్సులపై మెరుస్తున్న ప్రపంచం; మా చిట్టి తల్లులిద్దరు పోస్ట్ గ్రాడ్యుయేట్లే; వేషభాషలే కాదు, వాళ్ల ఆలోచనలు కూడా అత్యాధునికం; వివాహ ప్రసక్తి తెస్తే చాలు విరుచుకు పడతారు; ఇప్పుడా, ఈ రోజుల్లోనా, ముందు ఉద్యోగం, తర్వాతనే ఏదైనా; వాళ్ల మాటలు విని నాలో నేను నవ్వుకుంటాను.

స్నానాదికాల అనంతరం శరీరం మీద మరో శరీరం తొడుక్కుని, ముఖం మీద ముడతలన్నీ ఒకసారి సర్దుకొని, వీధి గుమ్మం వరకు మా ఆవిడ వెంట రాగా రోడ్డుమీద అడుగు పెడతాను; దినచర్యలో ఇది తప్పని సరి...

గడుస్తున్న రోజులు రజ్జువులై కాళ్లకు చుట్టుకుంటున్నట్టు, శరీరం మెలికలు తిరుగుతున్నా, గాలిలో ఏవో హెచ్చరికలు వినవస్తున్నా, జీవన ప్రవాహంలో మనిషి కదలిక చూడకుండా ఉండలేను నేను; ఒక శరీరాన్ని చుట్టుకొని ఎన్నో శరీరాలు, ఒక హృదయాన్ని చుట్టుకొని ఎన్నో హృదయాలు, అంతా సామాన్యులే, బ్రతుకు బరువు మోయలేక మోస్తున్న సామాన్య కుటుంబీకులే; స్వచ్ఛమైన మానవ పరిమళం; ప్రవాహ జలాలను గుండెలకు హత్తుకొని, మనిషి గుండె చప్పుడు వింటేనే గాని బ్రతకలేను నేను.

ఓహో, నువ్వా ఎక్కడ, ఎప్పుడు, ఎలాగ, ఏం చేస్తున్నట్టు? ఇంకా అక్కడేనా? ఆ వూళ్లోనేనా, ఉద్యోగం చేస్తున్నట్టేనా? దేశం ఎలా ఉన్నట్టు? సామాన్యుడు చస్తున్నాడా, బ్రతుకుతున్నాడా? ప్రపంచం ఎలా ఉన్నట్టు? గల్ఫ్ యుద్ధం ఒక ట్రాజెడీ, సోవియెట్ సూర్యగ్రహణం మరో ట్రాజెడీ, మరో ట్రాజెడీ..." స్వచ్ఛమైన మనుష్య శబ్దాలను శిరస్సుపై చల్లుకొని నిదానంగా రోడ్డుమీద నడుస్తున్నాను...

నా కోసమే ఎదురుచూస్తున్నట్టు వీధి పొడుగునా 'క్యూ'లో నిలబడిన చెట్ల క్రింద ఒకటే అలజడి; దీప స్తంభాన్ని పెనవేసుకొని కూర్చున్న పరిత్యాగి అలాగే ఉన్నాడు అక్కడే; దిన పత్రికలను మాత్రమే ఆహారంగా స్వీకరిస్తున్న కామధేనువు సరేసరి; నిదానంగా ముందుకు కదిలాను....

శిరస్సుపై జెండాలు నిలబెట్టుకొని ఇద్దరు వీధి రాక్షసులు కాళ్ల చేతులు నరుక్కుంటున్నారు భయంకరంగా; రాక్షసులా? ప్రత్యర్థి రాజకీయ మృగాలా? మాఫియా, మార్ఫియా ముఠా ముష్కరులా?

దూరంగా వీధి మలుపులో గుంపులు, గుంపులుగా జనం, దారిద్ర్య రేఖపై ఆకలి ఆగ్రహావేశాలు, కాల్పులు, హాహాకారాలు; 'కర్ఫ్యూ', 'కర్ఫ్యూ' అని అరుస్తున్నారు ఎవరో, క్షణంలో అంతా నిర్మానుష్యం...

నేను మాత్రం కదలలేదు, నా కాళ్లకు చుట్టుకుంటున్న మృత శరీరాలలో నన్ను నేను పోల్చుకుని స్తంభించిపోయాను అక్కడే;

నేను చూస్తున్న జీవితం ఇది, నన్ను వెంటాడుతున్న జీవితం ఇది; జీవితమా, నిర్జీవితమా? అరవై ఏళ్లు బ్రతికాను చాలు, ప్రవాహ జలాలలో అరవై ఏళ్లు నడిచాను చాలు; చావైనా బ్రతుకైనా ఇక ఒకటే, అంతా నిర్విచారం, నిర్విచారం, నిర్విచారం.

1992

# గణితం: కలలు, కన్నీళ్లు

నిశ్చలంగా ఉన్న నీళ్లలో రాళ్లు రువ్వుతున్నాను ఒక సాయంత్రం వేళ
నీళ్లు గాయపడడంలో విశేషం లేదు
గాయపడిన నీళ్లు ఉవ్వెత్తున ఒళ్లు విరుచుకొని నగరం మీద విరుచుకుపడడం విశేషం.

సుదీర్ఘంగా సాగుతున్న వాక్యం మీద ఒక వైపు అగ్ని, మరో వైపు జలపాతం
నా కన్నులు అవేనా?

జీవనద్వారాలు తెరిచాను
సంధ్య చీకట్లలో కూర్చుని ఇద్దరు గృహస్థులు దైనందిన సర్పాలను ఆహ్వానిస్తున్నారు ఆప్యాయంగా
కష్ట సుఖాలు చెప్పుకుంటున్నారేమో!
కలలు, కన్నీళ్ళు లెక్క పెడుతున్నారేమో!
జీవన మాలిన్యంలో కొట్టుకొని పోతున్న సంతతిని తలుచుకుని బాధ పడుతున్నారేమో!
క్లిష్టభూయిష్ఠమైన ఆకాశం క్రింద మనిషి ముఖ కవళికలపై చీకటి ఎర్రపడుతున్నదా?

* * * * *

స్వప్న కళేబరాలపై నిల్చుని భయంకరంగా అరుస్తున్నారు ఎవరో
"ఏం చేశాను నేను, ఏం చెయ్యగలిగాను నేను?
శూన్యగృహంలో అర్ధరాత్రి బావి నీళ్లలో చప్పుడు ఎవరైనా విన్నారా?
బావినీళ్లు చెప్పే మరణ వృత్తాంతాలు విన్నారా
ఏం చేశాను నేను, ఏం చెయ్యగలిగాను నేను?"

* * * * *

సుదీర్ఘంగా సాగుతున్న వాక్యం మీద ఒక వైపు రివాల్వర్, మరో వైపు పూలమాల
నా చేతులు అవేనా?

శతాబ్దం తలుపులు తెరిచాను
శకలవికలమైన స్వప్నాలపై మూర్ఛిల్లిన మనిషి శరీరం వైపు చేతులు చాచాను
ధూళి, దారిద్ర్యం, ఆకలి అర్ధనగ్న శరీరాలను మోసుకుని వస్తున్న గాలిని వేళ్లతో ముట్టుకున్నాను
గాలి స్తంభించినదా! ఆగ్రహాగ్నిలో
చేతులు ఎర్రపడుతున్నాయా!
ఎర్రబారిన నా చేతులలో మనిషి ఎర్రపడుతున్నాడా!
మనిషి నడుస్తున్న రోడ్లు ఎర్రపడుతున్నాయా?

* * * * *

మనిషిని శాసిస్తున్న ఒక మనిషిని మరో మనిషి చంపేశాడు నడివీధిలో
ఎవరు నేరస్థుడు, ఎవరు శిక్షార్హుడు?

* * * * *

గదిలో అక్కడక్కడ ఏవో పత్రికలు, పుస్తకాలు, వస్త్రకాళితం చేసిన గన్‌పౌడర్ పద్యాలు వినా మరేం లేవు
గది మధ్య ఖాళీగా ఉన్న కుర్చీలో ఎవరో కూర్చుని నా వైపు తీక్షణంగా చూస్తున్నట్టు భ్రమ
అక్షరం బలి కోరుతున్నదా?
సుదీర్ఘంగా సాగుతున్న వాక్యాలకు ఊపిరి ఆడడం లేదు
కవిత్వం నిజంగానే ఒక 'రహస్యోద్యమం'

1990

# ఇండియా! ఇండియా!!

నగర శరీరం మీద తెర జారుతున్నదా?

ఆరోజు న్యూస్ పేపర్ ముట్టుకున్నానో లేదో
అంతా నెత్తురుమయం!
ఒకే మృత్తిక నుంచి
ఒకే శరీరం నుంచి
ఒకే ఆత్మ నుంచి
ఒకే గాయం నుంచి
స్రవిస్తున్న నెత్తురు!

ఒకసారి నా చేతులవైపు చూసుకున్నాను,
హెడ్‌లైన్ క్రింద ప్రముఖంగా ప్రచురించిన చిత్రంలో
ఒకవైపు:
విజ్ఞాన సర్వస్వంపై కూర్చుని తాత్విక వృక్షాలపై రాళ్ల రువ్వుతున్న ఉన్మత్తులు
మరొక వైపు:
రాక్షస ధూళిలో కొట్టుకొనిపోతున్న ఒక యువతి భగ్నదేహాన్ని
రెండు చేతులా పట్టుకొని
ప్రపంచాన్ని భయంకరంగా శపిస్తున్న శిలా విగ్రహాలు!

మరొకసారి నా చేతుల వైపు చూసుకున్నాను
అప్పుడప్పుడు పువ్వులు, పద్యాలు, చంద్రకిరణ కింజల్కాలు వెదజల్లే
నా చేతుల నిండా ముళ్ళు, ముళ్లు
నా వేళ్ళ పొడుగునా సూదుల వలె దూసుకొని వస్తున్న ముళ్లు

నగరంలో మనిషి కంటకశరీరుడుగా మారుతున్నాడా?
నగర శరీరం మీద సూదులు గుచ్చుతున్న చేతులు నావేనా
భగవంతుడు కూడా ఇక్కడ క్షతగాత్రుడేనా?

శాంతి, శాంతి, శాంతి!
మనిషి ఆకలితో చస్తున్నా మోక్షప్రాప్తి ముఖ్యం కదా!
దేశభక్తులు వర్ధిల్లుగాక!
పీఠాధిపతులు వర్ధిల్లు గాక
రాజకీయ వ్యాఘ్రవాహనారూఢులు వర్ధిల్లు గాక
శాంతి, శాంతి, శాంతి
సర్వత్రా శాంతి.

1992

# డేట్‌లైన్ హైదరాబాద్
## (1990 డిసెంబర్ 8)

సకల దిక్పాలకులు విశ్రమిస్తున్న వేళ నగరంలో అర్థరాత్రి ఒక గల్లీలో తన మృతదేహం ప్రక్కనే కూర్చుని ఒక మనిషి ఇలా మాట్లాడుతున్నాడు:

"నేను చావలేదు
నన్నెవరో మోసుకుని వెళుతున్నారు, వాహనంలో కూర్చోపెడుతున్నారు
వద్దు, వద్దు, ఇది నా శరీరం, నన్ను తాకవద్దు, తాకవద్దు"

తన మృతదేహాన్ని మృదువుగా స్పృశిస్తున్న మనిషి ఇంకా ఇలా అంటున్నాడు:
"నేను కష్టజీవిని, ఇక్కడే బతుకుతున్నాను
ఇక్కడే ఒక రాత్రి నన్నెవరో కాళ్లతో త్రొక్కేశారు
నన్ను కత్తులతో పొడిచారు, కాళ్లు చేతులు నరికేశారు
నేనెవరో వాళ్లకు తెలియదు, వాళ్లెవరో నాకు తెలియదు"

తర్వాత అతడు నా రెండు చేతులు పట్టుకుని దీనంగా ఇలా అడిగాడు:

“నీ శరీరంలో సగ భాగం నాకు ఇస్తావా?
ఒకసారి మళ్లీ బ్రతుకుతాను
నీ కాళ్లు, చేతులు ఇస్తావా?
నా భార్య, నా పిల్లలు ఎక్కడ ఉన్నారో వెతుక్కుంటాను”

“మరి కళ్లు అక్కర్లేదా?”

“వద్దు, వద్దు మనిషి నెత్తురు నేను చూడలేను
కాళ్లు,చేతులే కళ్ళు”

అతడు అడిగినవన్నీ వెంటనే అక్కడే శాశ్వతంగా ఇచ్చేశాను
మరుక్షణం అతడు అక్కడ లేదు
తన మృతదేహాన్ని తానే మోసుకొని చీకటి మడుగులో అదృశ్యమై పోయాడు

‘ఖడ్గప్రళయం’ చూసిన నా రెండు కళ్లు చేత పట్టుకొని నేను మాత్రం ఇంకా అక్కడే ఉన్నాను, వాటిని మోయలేక, మోయలేక,చావలేక, చావలేక

“మనిషి ఒక్కడే, భగవంతుడు ఒక్కడే” అని నగరం నడివీధిలో ఒక పబ్లిక్ రాక్షసుడు కన్నీళ్లు గ్రుమ్మరిస్తున్నాడు భయంకరంగా;
భూమి బ్రద్దలై ఆకాశం అంతటా ఒకటే పొగ.

1990

# కర్ఫ్యూ నీడలలో...

ఎక్కడ ఉన్నాను నేను, ఎక్కడ ఉన్నాను?
గాలి వీచడం లేదు, గడియారం ఆడడం లేదు
గాలి నిండా కాలిన వాక్యాల వాసన
ఎక్కడ ఉన్నాను నేను, ఎక్కడ ఉన్నాను?

దీపం వెలగడం లేదు; టెలిఫోన్ పలకడం లేదు
గది నిండా చీకటి, కత్తులు నూరుతున్న చీకటి
నన్ను చుట్టుకుంటున్న చీకటి చేతులలో నెత్తురు
ఎక్కడ ఉన్నాను నేను, ఎక్కడ ఉన్నాను?

కిటికీ తెరుచుకోవడం లేదు, ఆలోచన సాగడం లేదు
అర్థరాత్రి సంకేతం కదా, విద్రోహి నిద్ర లేచాడనుకుంటాను
చీకటి పొదలలో నల్లత్రాచులు కదులుతున్నట్టు ప్రహరీ గోడ ప్రక్కన ఏదో కదలిక
ఎక్కడ ఉన్నాను నేను, ఎక్కడ ఉన్నాను?

మెట్ల మీద అడుగుల చప్పుడు
ఎవరో తలుపులు త్రోసుకుని వస్తున్నారు చూడు
తెర వెనుక ఎవరో కదులుతున్నారు చూడు
ఎక్కడ ఉన్నాను నేను, ఎక్కడ ఉన్నాను?

నగరంలోనా, నగరంలో నరకంలో నోరు తెరుస్తున్న బీభత్సంలోనా?
ఘనీభవిస్తున్న మృత్యునిశ్శబ్దంలోనా? ఎక్కడో అట్టడుగున రహస్య పేటికలోనా?
నెత్తురుగడ్డ కట్టిన శరీరంలోనా? అశరీరంలోనా?
ఎక్కడ ఉన్నాను నేను, ఎక్కడ ఉన్నాను?

"భయపడకు డియర్, భయపడకు, భయపడకు
హిట్‌లిస్ట్‌లో ఇక మనపేర్లు ఉండవులే; మృత్యు ముద్ర అప్రతిహతం
భయపడకు, భయపడకు,
కారుణ్యాముఖి పృధ్వి అరచేతులలో భద్రంగానే ఉన్నాం కదా మనం ఇప్పుడు!
ఎవరో ఇక్కడ పుష్పగుచ్ఛం ఉంచారు, అందుకో, అందుకో."

1990

# కిటికీ ఆవల...

ఒంటరిగా కూర్చున్నాను గదిలో
ఎవరో కత్తులు విసురుతున్నారు హృదిలో

కిటికీ ఆవల పూలతోటలో హంతకుడు

తెరుచుకుంటున్న ఆలోచనల కత్తుల బోనులలో
మధ్యాహ్న సుందరి మండుతున్న వేనలి మంటల గుబురులలో
ఆకలి ఆకారంలో పెద్దపులి

ఒంటరిగా కూర్చున్నాను గదిలో
ఎవరో సమాధి నిర్మిస్తున్నారు హృదిలో

కిటికీ ఆవల
వేసవి మదకరీంద్రాలకు ఆవల
సహస్ర వలయాలుగా విస్తరిస్తున్న అగ్నిఛత్రం క్రింద క్షుద్రదేవత పరిరంభంలో
ఎవరో నన్ను పోలిన భయకంపితుడు

ఒంటరిగా కూర్చున్నాను గదిలో
మృత్యువు అనేక రకాలు.

1963

# నాపై రువ్విన రాళ్ళు నా అక్షరాలు

ఉరిత్రాళ్ళు నా ఊహలు
సంకెళ్ళు నా మాటలు
నాపై రువ్విన రాళ్ళు నా అక్షరాలు

నాకు నిలయం లేదు
నాకు విలయం లేదు

అశాంతిని ఆక్రమిస్తాను
అడవిలో వెన్నెలను దుస్తులుగా ధరిస్తాను

అర్ధరాత్రి బీభత్సం మేలుకొనేటప్పుడు
శూన్యం మీద శూన్యంగా కూర్చుని
రాలుతున్న నక్షత్రాలమీద నా గీతం రచిస్తాను

ఆకాశం కనపడని చోట
చీకటి ఉరికంబంలా నిలబడిన చోట
నిశ్శబ్దం మీద నిశ్శబ్దంగా కూర్చుని
గాలిలో దీపాల మీద నా గీతం రచిస్తాను

నాకు రూపం లేదు
నా రూపం నా గీతం.

1948



# క్షణం క్రితం అక్కడ

క్షణం క్రితం ఆ వీధి ఎంత అందంగా ఉండేదో,
ఎంత ఉజ్వలంగా ఉండేదో!

నడుస్తున్న చెట్లు, నడుస్తున్న విగ్రహాలు, విశాల నేత్రాలు, అలంకృత హస్తాలు, అయస్కాంత క్షేత్రాలు, జనం, ధనం, కలకలం, కరస్పర్శ, కుశల ప్రశ్న, కేళ్ళురుకుతున్న సాయంత్రాలు, వాణిజ్య విన్యాసాలు, స్వప్నచ్ఛత్రాల క్రింద జీవన పరిమళాలు వెదజల్లుతున్న గృహిణులు, నడి వీధి గంధర్వులు, యక్షిణీ బృందాలతో

క్షణంక్రితం ఆ వీధి ఎంత అందంగా ఉండేదో,
ఎంత మనోహరంగా ఉండేదో

సౌందర్య రేఖపై నడుస్తున్నానా?
నక్షత్ర వీధిలో నడుస్తున్నానా?
విపణి విద్యుత్ కాంతులలో నడుస్తున్నానా?
జీవన వైదగ్ధ్యంలో నడుస్తున్నానా?

క్షణం క్రితం ఆ వీధి ఎంత ఉజ్వలంగా ఉండేదో!
ఎంత అద్భుతంగా ఉండేదో, ఎంత సమ్మోహనంగా ఉండేదో!

జ్ఞాపకాలు వెంటాడక మానవు
చీకటి పెనుభూతాలను మోసుకొని వస్తున్న వాహనం ఏదో
ఇటువైపే దూసుకుని వస్తున్నది.....

జాగ్రత్త సుమా!
ఇక్కడ భగవంతుడు కూడా నిస్సహాయుడే.

(విజయవాడ - బిసెంట్‌రోడ్డుకు అంకితం : 1988 డిసెంబర్ 26)

# స్లమ్ క్లియరెన్స్

**(I am from language and will return to language)**
**-PETER RILEY**

టెలివిజన్ సెట్ ముందు ఎప్పుడైనా కూర్చుంటానా,
ఇద్దరు సరస్వతీ విగ్రహ విక్రేతలు ఒకచోట కూర్చుని మాట్లాడడం ఎప్పుడైనా వింటానా,
అంతా మృత భాష, మృత భాష; వేదిక నిండా శబ్ద కళేబరాలే!

అక్షరాలకు రెండు జీవితాలు లేవు
అప్పుడే పుట్టిన ఒక శిశువు శరీరంలో ప్రవేశిస్తేనే తప్ప,
లేదా ఒక వీధి మనిషి శరీరాన్ని ఆశ్రయిస్తేనే తప్ప
అక్షరాలకు మరో జీవితం లేదు; అదైనా వేరే మరొక రూపంలో

ఇక పద్యం ప్రారంభిస్తాను
యథాశక్తి 'టెస్ట్‌ట్యూబ్' భాషలో

వస్తున్నవాడు నిర్ముఖుడు, నిశ్శరీరుడు
నగరంలో ఒక వీధి వీధినే అతడు స్వాహా చేశాడు.

(ఇతః పూర్వం అక్కడ మహంకాళి గుడి ప్రక్కన నల్లకాల్వ ఇరువైపులా చీకటి ముష్టి ఘాతాలకు తట్టుకొని బ్రతకలేక, బ్రతకలేక, బ్రతకలేక బ్రతుకుతున్న శిథిల శరీరు లెందరో, ఎందరో గుంపులు గుంపులుగా కూర్చుని ఆకలి వేడుకలు జరుపుకునేవారట పున్నమి వెన్నెలలో - హఠాత్తుగా ఒక అర్ధరాత్రి అంతా నిశ్శబ్దం, నిర్మానుష్యం, గుడిలేదు, గుడిసెలు లేవు, అంతా మటాష్, మటాష్).

సాక్ష్యం కావాలా, ధ్రువీకరణ పత్రాలు కావాలా!
మూసీ జలాలలో దీర్ఘనిద్రలో ఉన్న నిర్వాసులే ప్రత్యక్ష సాక్ష్యం.

తర్వాత మరో వీధి, మరో వీధి, మరో వీధి
క్రమేణా అతడు తన శరీరాన్నే ఒక ఇండస్ట్రియల్ కాంప్లెక్స్‌గా మార్చేశాడు

ఐదు వేళ్ళు ఒకే ముద్ర
శిరస్సు నుంచి వెలువడే పొగ
మేఘాలలో ఒకే జెండా
అంతా ఒకే బ్లూప్రింట్

ముఖ కవచం అభేద్యం కనుక:
పబ్లిక్ గార్డెన్స్‌లో కనపడే ముఖం వేరు,
సేఫ్టీ లాకర్‌లో భద్రంగా దాచిన ముఖం వేరు.

మనిషి నడుస్తున్నంత మేరా దేశభక్తి వాసన
అభ్యుదయం, అభ్యుదయం, అభ్యుదయం వాసన

మిత్రుడా, శ్రీనివాస్, జనం ఎందుకేడుస్తున్నారో
వేరే చెప్పాలా?

1992.



# రోజూ చూస్తూనే ఉన్నాను

రోజూ చూస్తూనే ఉన్నాను
ఆ కన్నుల వెనుక ఉమ్మెత్త చెట్లను, ఊసర క్షేత్రాలను
ఉద్రేకవంతమైన సరస్సులను, ఉరితీయబడుతున్న అక్షరాలను

రోజూ చూస్తూనే ఉన్నాను
రోజూ నడుస్తూనే ఉన్నాను
ఆ కన్నుల వెనుక తాళవృక్ష ప్రమాణంలో ఎదురయ్యే భయాల మధ్య
భయంకరమైన ఊరువుల మధ్య
మండుతున్న మధ్యాహ్నాల మధ్య
రుద్ర మందారాల మధ్య

రోజూ చూస్తూనే ఉన్నాను
రోజూ నడుస్తూనే ఉన్నాను
అవధారణ చేస్తూనే ఉన్నాను
ఆ కన్నుల వెనుక అప్పుడే భూపతనమైన ఆకలి ఆక్రందనలను
కన్నీళ్ళలో నిష్క్రమణ గీతాలను

రోజూ చూస్తూనే ఉన్నాను
రోజూ నడుస్తూనే ఉన్నాను
అవధారణ చేస్తూనే ఉన్నాను
ఆ కన్నుల వెనుక దీపం వెలుగదు
అక్కడ సంగీతం వినపడదు.

1948

# గోమాత సాక్షిగా

మెరుస్తున్న మధ్యాహ్న సూర్యకిరణ ఖడ్గచ్ఛాయలలో
అక్షర తాండవం ఎవరైనా చూశారా?
గుండె లోలోతులలో అక్షర సంగీతం ఎవరైనా విన్నారా?

నేను విన్నాను,
రావిశాస్త్రి కథలలో నేను చూశాను
గోమాత సాక్షిగా, మరిడీ మహలక్ష్మి నెన్నొసట నెత్తురు బొట్టు సాక్షిగా
ఒకే ఒక మాట చెపుతున్నాను
అశ్రుగంగాజలాలలో అగ్ని సుందరిని సృష్టించిన ఒకే ఒక కథకుడు అతడే, అతడే
అతడు నడుస్తున్నంతమేరా కదం త్రొక్కుతున్న శబ్ద హయహేష
ధీర గభీర జీవన కథా సరిత్సాగర ఘోష.

1983

# మాంత్రికుడు

గోడకు వ్రేలాడుతున్న శరీరంకాదు అద్దం అంటే!
అది నీ అంతరంగం

అద్దంలో నీ ప్రతిబింబం వెనుక ఎల్లవేళలా ఒక మాంత్రికుడు ఉంటాడు
అశ్వారూఢుడై ఉన్న ఒక సాహసికుడు ఉంటాడు
బాహ్య ప్రపంచ రహస్యాలను విరుచుకుని తింటున్న ఒక విదూషకుడు ఉంటాడు
అద్దం నీ అంతరాంతర ప్రపంచం

అద్దంలో అలలపై కదులుతున్న ప్రతిబింబాలను వినిర్గతం చేయడం సాధ్యం కాదు కనుక
సరాసరి నేనే ఒక క్షణం అద్దంలో ప్రవేశించాను
అద్దంలో ఇప్పుడు నా ప్రతిబింబం లేదు,
నేను మాత్రం అక్కడే ఉన్నాను అశరీరంగా.

1990



# రాజకీయ ఘస్మరుడు

సమకాలీన రాజకీయ వితర్దికపై
సర్వాంతర్యామిత్వాన్ని ప్రకటిస్తున్న ప్రజాస్వామ్య వటవృక్షం వలె
నిలువెల్లా అతడు నిండుగా నిశ్చలంగా నిత్యసత్యాలకు అతీతంగా ఉంటాడు

హుంకరిస్తున్న సామ్యవాద భావాలకు
అధ్యక్ష పీఠం
మనిషి ముమ్మాటికీ రాజకీయ ఘస్మరుడే

సాధారణ ప్రమాణాలను జయించిన భుజస్కంధాలపై
కండలు తిరిగిన దేశభక్తి ఎల్లలోకాలకు అభయముద్ర
శిరస్సుపై దీనజనోద్ధరణ సూర్యుడు చంద్రప్రచండుడే కదా

ప్రజాహిత కార్యక్రమాలలో తడిసిన ఇంద్రలుప్తకం క్రింద
సత్యాగ్రహాన్ని ప్రసరిస్తున్న కిటికీలవలె చిన్నచిన్న కన్నులు
పెదవులపై చిరునవ్వు ప్రజాస్వామ్య విలసనమే

స్వచ్ఛంద సేవానిరతి సముజ్వలించిన రీతి
కనుబొమ్మలపై నడివాకిలిలో సర్వోదయ కుంభం
అభ్యుదయ పరిమళాలు వెదజల్లుతున్న కొనగోళులపై
రూపాయల వలె ప్రమోగే నినాదాలు లోకకళ్యాణ గీతికలే కదా

జెండాలు, ప్రణాళికలు, ముఖంమీద ముద్రాలంకారాలు ఏవైతే నేం
జనవాక్య విన్యాస నైపుణిలో
ముమ్మాటికీ అతడు అగ్రశ్రేణి కళాకారుడే

శోధన నాళికలో సోషలిజం ఇటీవల సరికొత్త ఉద్యమం
ఆగామి విప్లవాన్ని ఆఘ్రాణిస్తున్న నాసిక దిగువ
సత్యం, అహింస క్రకచ శ్మశ్రువులే సుమా
సిద్ధాంతాల రసాయన సంయోగంలో సామ్యవాద సుందరి ఖండిత వక్షోజాలు ప్రత్యేక ఆకర్షణ

తామ్ర వస్త్రధారుడై నగరద్వారాల మధ్య అందంగా అందలంలో ఒకసారి
ప్రత్యక్ష హిరణ్య హిరణాలు వెదజల్లిన చాలు
అతని ముఖంమీద సూదులతో శాస్త్రీయ సామ్యవాద బీజాక్షరాలు చిత్రించడం అన్నా
వెన్నెముక పొడవునా ఎర్రతేళ్ళు ప్రాకించడం అన్నా నాకు చెప్పలేనంత సరదా.

1972

# శ్రీ శ్రీ

శ్రీశ్రీ
రెండు అక్షరాలు
భూమ్యాకాశాల మధ్య రెండు ఖడ్గ ప్రహారాలు

ఒక వైపు ఖడ్గ కాంతులు వెదజల్లుతున్న కన్ను
మరోవైపు వెన్నెల విలక్షణ కాంతులు వెదజల్లుతున్న కన్ను
ఎడారి అంచులపై ఉషస్విని రహస్య విన్యాసాలను ఆవిష్కరిస్తున్న చేతులలో
అక్షరాకృతి ధరిస్తున్న అరుణారుణ కిరణాలు - అతడే మహా కవి శ్రీశ్రీ

అశాంతి, ఆవేదన మనిషిని విహ్వాలితం చేస్తున్నవేళ
మహాకవి శ్రీశ్రీని ఒకసారి తలుచుకుంటే చాలు
వాగ్దేవి ఆలయ ప్రాంగణంలో అక్షర మహోత్సవం చూడవచ్చు
చీకటి పర్వత శ్రేణులలో అర్ధరాత్రి సూర్యోదయం చూడవచ్చు
అధర్మ నిధనం చేస్తున్న కావ్యఖడ్గ విన్యాసాలు చూడవచ్చు

మహాకవి శ్రీశ్రీని ఒకసారి తలుచుకుంటే చాలు
సంకెళ్లు తెంచుకుంటున్న మనిషి భుజా స్ఫాలనం చూడవచ్చు
రుద్ర భూమిని చీల్చుకుని వస్తున్న ప్రచండ హస్తాలపై రెక్కలల్లార్చిన గండభేరుండాలను చూడవచ్చు

సర్వం కవితామయం

శ్రీశ్రీ శబ్దశక్తి సోకిన చోట
రాళ్ళు అక్షరాలుగా మారినా, చెట్లు నాట్యం చేసినా ఆశ్చర్యం లేదు
శ్రీశ్రీ పేరు వింటే చాలు
జడప్రాయుడైనా నిద్ర మేల్కొంటాడు
జీవన సంగ్రామంలో క్షతగాత్రులు సైతం ఒళ్ళు విరుచుకుని ముందుకు దూకుతారు
శిరస్సు తెగిన మనిషి మళ్ళీ కళ్ళు తెరుస్తాడు

సర్వం కవితామయం

శ్రీశ్రీ కవిత్వం అనే చిత్ర విచిత్ర దర్పణంలో మహాద్భుతాలు ఇంకా ఎన్నెన్నో........
కాలావధులపై కత్తుల వంతెనలను కూల్చుతున్న మహా సాహసిని చూడవచ్చు
ఆకలి, దారిద్ర్యం, అన్యాయాలు, అత్యాచారాల మీద
మనిషిని మనిషి దోచుకు తినే సాంఘిక వ్యవస్థమీద, శిలా శాసనాలమీద
ఆధునిక రాక్షసుల జన్మ రహస్యాలమీద రణన్నినాదాలు వినవచ్చు
ప్రళయ భీకర గర్జారావం వినవచ్చు

సర్వం కవితామయం

శ్రీశ్రీ వచో వైభవం అపూర్వం, అనన్యం
అందుకే మళ్ళీ మరొక సారి అంటున్నాను
శ్రీశ్రీ పేరు తలుచుకుంటే చాలు
వాగ్దేవి ఆలయ ప్రాంగణంలో అక్షర మహోత్సవం కళ్ళారా చూడవచ్చు
రానున్న సూర్యోదయాలపై కూడా శ్రీశ్రీ సంతకం చేస్తున్న సన్నివేశం చూడవచ్చు
ఈలోగా నిశ్శబ్దం, నిశ్శబ్దం మీద నిశ్శబ్దం.

1983

# నీ గదిగోడలపై అగ్నిచక్షువు నేనే

ఘూర్ణిల్లుతున్న విషాద వృక్షచ్ఛాయలలో అదృశ్యలోకాలను ఆవిష్కరిస్తున్న స్వాప్నికుడా
నేను నీలోనే ఉన్నాను, నీ కన్నీళ్ళలోనే ఉన్నాను
నిషిద్ధ నగరంలో నీ ఆక్రందన ఎన్నోసార్లు విన్నానుకదా
నీ గది గోడలపై అగ్నిచక్షువు నేనే

నడిరాత్రి, నడివీధి స్వప్నకవాటాలు తెరుస్తున్నారు ఎవరో
నవ్వుతున్న పెద్దపులి కావచ్చు
వధ్యశిలలపై అరణ్య కుసుమాలు వెదజల్లుతున్న పరివ్రాజకుడు కావచ్చు
అజ్ఞాత యోధులను ఆశీర్వదిస్తున్న వనదేవత కావచ్చు
కాలమేఘాంచలాలపై వస్తున్న మృత్యు రధచోదకుడు కావచ్చు

నడిరాత్రి, నడివీధి అలజడి సృష్టిస్తున్నారు ఎవరో
నడుస్తున్న శిలా విగ్రహాలు కావచ్చు
చీకటి సోపానాలపై సాలభంజిక హెచ్చరిక కావచ్చు
జీవన సంకేతాలను కలుష భూయిష్ఠం చేస్తున్న విద్రోహి క్షుద్ర విన్యాసం కావచ్చు

నడిరాత్రి, నడివీధి మృత్యురేఖపై నగ్నతాండవం చేస్తున్న స్వాప్నికుడా
జ్వలిస్తున్న కన్నీళ్ళలో ప్రతిఫలిస్తున్న ఆకారం నీదేనా?
మృత్యువు కలతనిద్ర క్షణమాత్రమే సుమా!

రాక్షసుని వెన్నెముకపై ప్రతిష్ఠించిన నగరంలో మనిషి చిత్రవధ ప్రత్యేక కళ
కలలలో సైతం అతడు శృంఖలుడే.

1986



# ఆత్మఘోష

పూలమాలలోనా మృత్యువు?
అభివందనం చేస్తున్న చేతులలోనా మృత్యువు?
అపశబ్దం, అపశబ్దం, అపశబ్దం.

''ఇక్కడ శరీరాలు అమ్మబడును
జెండాలు, రివాల్వర్లు పట్టుకున్న చేతులు విడివిడిగా కూడా అమ్మబడును
క్షణాలలో మనిషిని మటుమాయం చేసే ముసుగు మనుష్యులు కావాలా?
ఆధునిక మృత్యు గణితసూత్రాలను కంఠస్థం చేసిన హంతకుడు కావాలా?
మనుష్య సంబంధమైన విధ్వంసక పదార్థం ఏదైనా ఇక్కడ అమ్మబడును
మనిషిని మృత్యు పరికరంగా మార్చే ప్రత్యేక ఇంధనం కూడా అమ్మబడును''

వాణిజ్య కంఠంతో అరుస్తున్న వాల్‌పోస్టర్ ముందు
ఖండిత శిరస్సు హెచ్చరిక ఒక లెక్కా?

పూల చెట్లు విలపిస్తున్నాయా?
ఇక్కడ అన్నీ అపశబ్దాలే
మృత్యువు తన ముఖం చూసుకొని తానే భయపడుతున్నట్టు
అన్నీ కఠోర శబ్దాలే... ధ్వంసక్రీడ, దగ్ధక్రీడ

నిద్రలో నడుస్తున్న మనిషి నెత్తురు మడుగు దాటగలడో లేదో!
పూల చెట్లు శపిస్తున్నాయా?

రాక్షస కంఠంతో అరుస్తున్న వాల్‌పోస్టర్ ముందు
ఆత్మఘోష ఒక లెక్కా

విలాసమందిరాలలో సంగీతం వినవస్తూనే ఉన్నది
సూత్రధారులు నాట్యం చేస్తూనే వున్నారు
నగ్నదేవత ఆరాధన నిరాఘాటంగా సాగుతూనే ఉన్నది.

జీవితం ఎంత అర్థరహితం! 1991

# మహా నిశ్శబ్దం

నేను చూస్తున్నాను కనుకనే సూర్యుడు ప్రకాశిస్తున్నాడని అనవచ్చునా?
ముఖంమీద గాయం తప్పదు

నేను ప్రత్యేకంగా ధరించిన ముఖంమీద కాలకన్యక నఖక్షతం వలె మెరుస్తున్న విషాదరేఖ
శాఖోపశాఖలై శత సహస్ర జిహ్వికలై
నిలువెల్లా నన్ను దగ్ధపటలం చేయకముందే హఠాత్తుగా ఒక క్షణం.....

నా కన్నులవెనుక శిలావిగ్రహాలపై పరిభ్రమిస్తున్న రహస్య ప్రపంచంలో ప్రవేశించాను
జీవన వైరుధ్యాలను చీల్చుకొని వస్తున్న మహాశ్రుకణంలో ప్రవేశించాను
అశ్రుకణం వెనుక కంటకపరీవృతమైన స్వప్నంలో ప్రవేశించాను
స్వప్న కుడ్యాలపై వ్రేలాడుతున్న అద్దంలో ఛిన్న విచ్ఛిన్న రహస్య ప్రతిబింబాలలో ప్రవేశించాను

అంతటా ఒకే స్పర్శ, ఒకే నిశ్శబ్దం
నా శిరస్సుపై వ్రేలాడుతున్న ఖడ్గం మీద నా చేవ్రాలు వినా మరో సంకేతం అక్కడ లేదు
మిత్రుడా, ఇప్పుడు నేను స్వచ్ఛమైన పరమ పవిత్రమైన మహా నిశ్శబ్దంలో అడుగుపెడుతున్నాను
తెర జారుతున్నది మెల్లగా.... మెల్లగా
మెల్లగా....

1992

# కవిత్వం ప్రచురణలు

(1) క్రితం తర్వాత - ఆరుగురు యువ కవుల సంయుక్త కవిత - రూ. 2/-

(2) యెక్కడైనా యిక్కడే - ప్రీతీష్ నంది కవిత్వానువాదం - రూ. 2/-

(3) 19 కవితలు - గాలి నాసర రెడ్డి - రూ. 2/-

(4) ఒఖడే - స్మైల్ - రూ. 2/-

(5) బతికిన క్షణాలు - వేగుంట మోహన ప్రసాద్ - రూ. 10/-

(6) ఇక ఈ క్షణం - నీలిమా గోపీచంద్ - రూ. 5/-

(7) ఫోర్త్ పర్సన్ సింగులర్ - గుడిహాళం రఘునాథం - రూ. 5/-

(8) బాధలూ - సందర్భాలూ - త్రిపుర - రూ. 5/-

(9) గురిచూసి పాడే పాట - స్త్రీవాద కవితలు - రూ. 10/-

(10) ఎన్నెలో ఎన్నెల - రావిశాస్త్రి కవిత్వం - రూ. 10/-

(11) పుట్టుమచ్చ - ఖాదర్ మొహియుద్దీన్ - రూ. 10/-

(12) మరోవైపు - దేశ దేశాల కవిత్వం - రూ. 10/-



అన్నిటికీ కారకుడు మనిషి కనుక ప్రతి మనిషిలో నన్ను చూసుకోవడం నాకెంతో ఇష్టం. మనిషి ఎక్కడ వున్నా ఒకడే. పృథ్వీతలంపై మనిషి అడుగుల చప్పుడు వినపడిన తొలిక్షణం నుంచి మనిషి అంతరాత్మ ఒక్కటే. నేను ప్రతి మనిషిలో వుంటాను. ప్రతి మనిషి స్వప్నంలో వుంటాను. స్వప్న సౌందర్యంలో వుంటాను. బాధలో, దుఃఖంలో మండుతున్న గాయాలలో వుంటాను. ఎడారిలో మనిషి ఆక్రందనలో వుంటాను. అథః పతితుడైన మనిషిని ఆప్యాయంగా లేవనెత్తుతున్న కారుణ్యా హస్తాలలో వుంటాను. అక్షరాలకు సంకెళ్లు లేవు. భూగోళంపై సరిహద్దులు లేవు. మనిషి ఆత్మ ప్రకంపన ఒక్కటే అతడు మాట్లాడే భాషకు ఆయువుపట్టు. ప్రతి అక్షరం ఒక మనిషి. ప్రతి మనిషి ఒక అక్షరం. మనిషి ముఖ కవళికల వలెనే, మనిషి అవయవ నిర్మాణం వలెనే అక్షరాలకు కూడా ఒక ఆకారం, ఒక భంగిమ, భావానుగుణ్యమైన ఒక కదలిక, ఒక లయ, ఒక విన్యాసం, రంగు, రుచి వుంటాయని నేను విశ్వసిస్తాను. స్వప్నలిపి రహస్యం ఇదే. దైనందిన జీవన బీభత్సంలో నేను చేస్తున్న విచిత్ర విన్యాసాలే నా కొత్త ఛందస్సు.

# కవిత్వం ప్రచురణలు